వేంకటసుబ్బారావునాయుడు, తిక్కాని

# సమ్మోహనశాస్త్రము

మదరాసు, 1915

Record no. 444

## Bibliographic Record Target

వేంకటసుబ్బారావునాయుడు, తిక్కాని.
సమ్మోహనశాస్త్రము / తిక్కాని వేంకటసుబ్బారావు నాయుడుగారిచే రచింపఁబడినది.- మదరాసు : ఏ. యన్. రామాకంపెనీ, 1915.
8, 70 p. :port. ;18 cm.
Record no. 444

Vēṅkaṭasubbārāvunāyuḍu, Tikkāni.
Sammōhanaśāstramu / Tikkāni Vēṅkaṭasubbārāvu nāyuḍugāricē racimpam̐baḍinadi.- Madarāsu : Ē. Yan. Rāmākampenī, 1915.
8, 70 p. :port. ;18 cm.
Record no. 444

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

ప్రవేశ సంఖ్య.

## సారస్వత నికేత

ఇండ్లకు గ్రంథముల

పాఠకుని / ~~పాఠకురాలి~~ పేరు. [illegible]

తండ్రి ~~లేక భర్త~~ పేరు. [illegible]

వయస్సు 17 కులము [illegible]

ప్రస్తుతపు చిరునామా } గ్రామము చీరాల

స్థిరనివాసము—గ్రామము చీరాల

దరఖాస్తుదారుడనైన నేను యీ గ్రం
ములో నున్న నిబంధనలకును యికముందె
బద్ధుడనై గ్రంథముల నుపయోగించు కొన

స్థలము...చీరాల.....
తేదీ..18.3.1941..



శ్రీరస్తు.

# సమ్మోహనశాస్త్రము.



కలియుగ విశ్వామిత్రుడగు

ప్రొఫెసరు

తిక్కాని వేంకటసుబ్బారావు నాయుడుగారిచే

రచింపఁబడినది.



మదరాసు:

ఏ. యస్. రామా కంపెనీ

వారిచే ప్రకటింపబడియె.

—

[దీని వెల రు. 1.

Printed at the Vedam & co :—Madras.
1915- Second Edition 1000 Copies.



PROFESSOR T. V. SUBBARAO NAIDU
*Master Magician, Mesmerist, Hypnotist and Telephethist*

# TESTIMONIALS.

OF

## Professor T. V. SUBBA RAO,

*Master Magician, Telepathist Hypnotist and Mesmerist.*

I attended the exhibition held by Prof. T. V. SUBBA RAO NAIDU, of his feats of mesmerism and magic including his tricks in cards, coins, hat, ring, etc., to a perfection. He deceives the eye of even a closely observing person so cleverly that he is obliged to think that Prof. Subba Rao possesses supernatural powers in that art. He is also known well in Madras lately that he can cure all nervous diseases besides hysterics, rheumatism and hydrophobia. He can safely be trusted with the patients of the above diseases as he is a truthful and honest person.

Young as he is. he is very smart, and amiable. I wish him to open a place of business in Madras to be useful to the public in this kind of easy cure.

(Sd.) M. PAPARAO NAIDU,

MADRAS: *Deputy Superintendent,*

*1st June* 1911. *C. I. Simla.*

---

II

I witnessed the tricks and mesmeric feats performed by Prof. SUBBA RAO on Saturday evening in the College Hall. Some of his card tricks and his trick with rings appeared very clever. I am opposed to mesmerism, as I regard it to be hurtful.

(Sd.) REV. Dr. HENRY HUIZINGA,

ONGOLE, M.A., PH.

*5th. Dec* 1910. *Ag. Principal, A.B. M. College.*

---

III

I am glad to bear testimony to the skill with which Prof. SUBBA RAO entertained the audience at the College Hall on Saturday evening last. Like Doctor Huizinga, I believed that mesmerism is a dangerous tool in inexperienced hands but Mr. Subba Rao's skill in mesmerism and ledgerdemain is well woith witnessing. I wish him all success.

ONGOLE, (Sd.) REV. SAMUEL D. BAWDEN,
*5th Dec.* 1910. M A., BS. C.

---

IV

I witnessed Prof. SUBBA RAO's performance in our College Hall. last Saturday night, and was much pleased and surprised at his cleverness. His performance was in many respects equal to the best that I have ever seen. I feel sure that his work will be acceptable to the most critical audience.

ONGOLE, (Sd) B. J. ROCKWOOD, B. A.
*5th Dec.* 1910.

---

V

I had the pleasure of witnessing Prof. Subba Rao's performance of tricks and mesmerism and, for a beginner in these arts, which I understand him to be, his performance was most skilful. He deserves every success and encouragement, and carries with him my best wishes'

BEZWADA, (Sd) E. J. LOAN,
*19th Nov* 1910. *Supt, Govt. Workshops*

---

VI

I had the pleasure of witnessing the perfcrmance of Pofr. T. V. Subba Rao, Master Magician and Mesmerist, at the District Judge's Bungalow, and I am happy to say that the professor, though yet a young man, has exhibited hisperformance in a cleverly, dexterously and masterly way, and has made the audience fully pleased. I heartily wish the young profess. or a successful career and prosperity.

CAMP, TANJORE; (Sd.) R. SAMINATHAN,

---

VII.

Last night I witnessed an exceedingly clever performance of conjuring tricks by Prof. T. V. Subba Rao at the District Judg's house. He gave us a very interesting and enjoyable entertainment.

(Sd.) S. F. CHATHAM.
TANJORE, *Dt. Superintendent of Police.*
18—3—1911. *Tanjore.*

---

VIII

I attended one of Prof. T. V. Subba Rao's magic performances at the Coronation Carnival on the night of 30th December last· I enjoyed it very much indeed. He performs the tricks very neatly to the great amazement and hearty amusement of his audience. He is also a successful mesmer-ist. He deserves every encouragement and I sincerely wish him all success.

PADMA VILAS, (Sd.) V. C. DESIKACHARRY,
LUZ, MYLAPORE, *Judge, Court of Small Causes,*
Tuesday, 2nd Jany 1912. *Madras.*

---

IX

THE CORONATION DURBAR CELEBRATION.

Professor T. V. Subba Row, Magician and mesmerigats ve a very successful performance on the Island on

the 12th December 1911, in connection with the Coronation Durbar Peoples' Fete. He deserves encouragement.

MADRAS, T. RAGHAVIAH,
4th January 1912. *for Honorary Secretaries.*

---

X

I had an opportunity of witnessing Prof. T.V. Subba Rao's feats in mesmerism and magic. He exhibited mesmeric powers of a high order and his magical feats were ever interesting and very well performed,

14—8—1912. P. R. SUNDARA AIYER.

---

శ్రీరస్తు.

ఉ. శ్రీయదువీరు రుక్మిణిని శ్రీశివుఁ బార్వతి ధాతశారదన్
వాయుసుతున్ గణాధిపుని పర్ణనివాల్మికి వ్యాసుఁ గాళిదా
సాయత తేజునన్నపను యాజినిఁ బెద్దన నెంచి కాకవుల్
కూయకుడంచుఁ దెల్పియొక క్రొత్తగు కబ్బము వ్రాయఁబూనితిన్.

గీ. ఇష్టదైవాదులకు మ్రొక్కి కష్టజీవు
లైనసుకవులనొక్కి యాత్మాన్వయంబు
సరణినొక్కింతఁ గాంక్షతో సంగ్రహముగ
వ్రాయుచున్నాఁడఁ గవికదిప్రతమగుకద.

సీ. పద్మనాభునిపాదపద్మముల్ సేవించి, వెలయునాదివెలమకులమునందు
జెలువొందుశిల్లారి సెట్ట్యన్వయంబు, నందురామస్వామినాయనికిని
లలితలక్షణలక్ష్యలక్ష్మిమాంబకునుసం, తానమైయబలఁదిక్కానిరంశ
జలధికిఁ జంద్రుఁడై విలసిల్లిరాజకీ, యోన్నతోద్యోగంబులొందికీర్తి
రాజితుండగుచలపతిరాయనాయ
నికిరాజమ్మసాధ్వీమణికినిదత్త
సుతుఁడనగువాఁడ వేంకటసుబ్బరాయ
నామధేయుఁడసజ్జన స్తోమహితుఁడా.

ఉ. కొంచెమొగొప్పయోచదువుకొంటిఁ దెలుంగుననాంగ్లభాష నే
ర్పించిరి తల్లిదండ్రులు పరిశ్రమమెంతయు సల్పియాపలన్
మించినపేరుఁ గాంచితిఁ మెస్మరిజమ్మను దివ్యవిద్యలోఁ
గాంచితిమేల్మి పైఁడిపతకమ్ములనన్నత రాజధానులన్

గీ. తొల్లిటిమహర్షులెల్లరద్భుతముఁగొల్పు
విద్యనెఱుఁగుదురిద్దానిపేరుభిన్న
మపుడు మనవారు యోగమందురి నేఁడు
మూర్ఛరింగ్లీషుదొరలుమెస్మరిజమనుచు.

శా. రోగంబుల్ శమియింపఁజేయనగువారున్వీరువహ్వాయనన్
గాఁగల్పింపఁగ వచ్చునద్భుతముల్ కార్యంబులెన్నేనియే
కాగ్రంబైనమతిన్ జగద్విభునిదివ్యశక్తితత్వమున్ గాంచనా
యోగాభ్యాసము సల్పువారలకునోహో దుష్కరంబుండునే.

ఉ. ఇమ్మహనీయవిద్యజను లెల్లరకభ్యసనీయమంచు నే
నెమ్మనమందుఁబల్మఱుఁగణించి తెలుంగునఁదేటశైలిఁద
త్వమ్ము రచింపఁబూనితి బుధప్రజమియ్యది యభ్యసించిది
వ్యమ్మగునాత్మశక్తిఁగని యవ్యయసౌఖ్యమునందుఁగావుతన్.

## అంకితము.

మొగిదివాన్బహదూరుముట్నూరియాదివా, రాయణార్యునకునర్థాంగలక్ష్మి
అలయరుంధతి ముఖ్యలగుపతివ్రతలలోఁ, బాటి సేయఁగవచ్చుపరమసాధ్వి
తనయనంతరపుసుందరులయందఱకుధా, దర్శమైయొప్పారధన్యురాలు
విద్యాభివృద్ధికై వేయూఱువిధములఁ బతిచందమునఁ బాటుపడెడితన్వి
కామధేను వనందగు కామమాంబ
దీని ముద్రింపఁజేసి విజ్ఞానమునకుఁ
జాల సాహాయ్యమొనరించె సతతమామె
చిత్తమునయందె దేవి వసించుఁగాత.

## యోగ్యతాపత్రములు.

సీ. వివరింపఁదికాకినివేంకటసుబ్బరాయప్రణీతంబగునట్టిమెస్మ
రిట్శాస్త్రిమనుదీనిఁ బ్రియమునఁ గాంచితి, మేగ్నటిజంబును మెస్మరీజ
మునుహిప్నాటిజమునను నట్టియాకర్షణములసత్సమ్మోహనంబుమఱియు
వనిలవిరోధంబు ననుమూడువిద్యలు, సల్లక్ష్యలక్షణ సహితముగను
సరవిఁదాఁజేయు సకలేంద్రజాలములను
విరళముగవ్రాసి ప్రకటించె విశదముగను



పాఠకులకిదిదర్పణప్రాయమగున
టంచుసాటింపవచ్చుసాహసముతోడ.

ఇట్లు,
బి. వెంకటరంగము నాయుడు,
ఆయుర్వేదీయ, వైద్యజ్యోతిష విద్వాన్.

ఆశుకవి చక్రవర్తులు, శతావధానకవులు వేంకటసుబ్బారాయ, వేంకటరమణాభిదాసు లొసంగిన యోగ్యతపత్రికా పద్యములు.—

ఉ. జానగుమెస్మరీజమిటుచారుతరంబుగఁజేయువారియం
దూనమహేంద్రజాలమునసుద్ధతకీర్తివహించువారియం
దీనిపుణత్వముండుటదియేడనెఱుంగఁగలేదుగానతి
కాకినికులీనుఁడీఘనుఁడఖండయశంబును గాంచుఁగావుతన్

క. కలియుగవిశ్వామిత్రుఁడు, సులలితతికాకినికులుఁడుసుబ్బాగావా
నిలనిట్లుగాకయుండిన, బలుచిత్రపుఁబనులనిట్లుప్రచరించునొకో.

మ. మునుగోగోపకులన్ హరించినస్వయంభున్ మెప్పుఁజెందింపఁగా
ననమాయామహిమంబుచేతమరలన్ దతడుల్పనంజేసి హె
చ్చినకీర్తింగనుకృష్ణదేవునిగతిన్ జిత్రాతిచిత్రంబులౌ
పనులంజూపెజనంబులౌననంగసుబ్బారావునాయుఁడిటన్.

ముత్యాలుపేట హైస్కూలు తెనుగు సీనియర్ పండిట్ పోకల-నరసింహారావు నాయుడుగారిచ్చిన యోగ్యతపత్రికా పద్యములు.—

మ. బళిరాచక్కని నీదుజాలములుసేబాసెంతయున్నొప్పునా
వలఁజూపించినమోహనంబు మదికిన్ బాటింపఁగాజాలమీ

కలికాలంబునఁ బుట్టినట్టిఘనుఁడౌ గాధేయుతిక్కానిస
త్కులసంజాతుఁడసుబ్బరాయతగునీకున్ మాని పేరెంతయున్.

కరమరుదుగ సభ్యులకును
వరేంద్రజాలంబుఁ జేసి వారునుతింపన్
వరసమ్మోహనవిద్యను
సురచిరగతిఁ జూపినావు సుబ్బారాయా.

నరపతులాదిగ నరుదుగా నీవిద్యలనుజూచి మది సెబాసనఁగ భువిని
రమణీయమగువిద్య లమరనీయుఁడగుఁ, దిక్కానిసుబ్బారావు నానతింప
సింహబలుండవై చెలఁగుదువొకమాఱు, కౌశికుండవయియొక్కసమయమున
హాస్యరసముఁ జూపి యలరుదువొకతఱి, బ్రహ్మవైయొక తేఁపఁ బరఁగుదీవు
రాజితంబుగనొక రోజుమనోసంభవులను గాంతలను నతులసుశక్తి
నా సభకునువచ్చునట్లు సేయుదువీవ, యెడుఁగవిన్నివిద్య లొప్పనీకు.

అబ్బా యేమని చెప్పవాఁడఁగనఁగా నాశ్చర్యమౌంగల్గునా
సుబ్బారావొనరించు కార్యములహా చోద్యంబులౌజాలముల్
దిబ్బంబుండనచేతనార్పిమరలన్ దిక్కానివంశోద్భవుం
డబ్బాలాడజనుల్ వెలుంగనొసఁగన్ హాస్యంబుగాదింతయున్.

సభ్యులెల్లరు మదిమెచ్చి సంతసిల్ల, జాలముంజూపి మోహనసరణిఁ జూపి
బలుయశముఁ గొంటిబంగారుపతకములతో, సుగుణగణగేయతిక్కానిసుబ్బరాయ.

ఓం.

# ఉపోద్ఘాతము.

ఆర్యులారా! నేనీచిన్నపొత్తమును అనేకములయిన పనులయందుండి వ్రాయఁ బ్రయత్నించితి. కనుక దీనియందుఁ దప్పులున్నఁ బెద్దలయినవారు దీనియందుండు మంచి సంగతులనుగ్రహించి తప్పులను వదలివేయుదురని నేను బ్రార్థించుచున్నాఁడను. ఈ పుస్తకమును నేను ముఖ్యముగా వ్రాయుటకుఁ గారణంబేమన నింతకుముందు మన తెలుఁగుభాషయం దీసమ్మోహన విద్యనుగుఱించి తేటఁగాఁ దెలుపు పుస్తకము లేనందునను, మఱియు నా మిత్రులనేకులీపుస్తకమును వ్రాయుటకు నన్నుఁ బ్రోత్సాహపఱచినందునను దీనిని నేను వ్రాయుటకుఁ గారణంబయ్యె. నేనీ విద్యననేక ప్రదేశములయందుఁ జూపియుంటిని మఱియు నీ విద్యచే ననేక ప్రదేశములయందు ననేక రోగములను బోఁగొట్టి యుంటిని. నేను వీటి నన్నిఁటినిఁ జేయుటంబట్టి నా స్నేహితులందఱు దీనిని నేర్చుకొనఁదలఁచి, నన్నీపుస్తకమును వ్రాయుటకు బలవంత పఱచినందువలన నీసమయంబున నేను దీనిని వ్రాయుట తటస్థించినదియేగాని లేనియెడల దీనిని నీ సమయంబున వ్రాసియుండువాఁడనుగాను. కావున దీనిని నేను విస్తారముగా వృథామాటలతోఁ బుస్తకమును నింపక అందఱికిని నుపయుక్తమగు సంగతిచేతను వారలేలాగున వాడుక

చేసిన సులభముగావచ్చు మార్గమును మిక్కిలి సులభమయిన మృదుమధురవాక్యములతో వ్రాయఁబడినది. కావున దీనిని జనులందఱు నభ్యసించి మనపూర్వీకులవలె గొప్ప మహిమలు గలవారలై మన ఇండియాదేశమునకుఁ బూర్వపు ఖ్యాతిని మరల దెచ్చెదరని నేను మనస్ఫూర్తిగానమ్మి యీ పుస్తకమును వ్రాసినాఁడను.

ప్రొఫెసర్. తిక్కాని - వేంకటసుబ్బరావు.

ఆర్యులారా, పూర్వము మనహిందూదేశంబున మంత్రశాస్త్రవేత్తలును యోగాభ్యాసపరులును వేలువేలుగానున్నటుల మనపురాణములవలనను మనపూర్వీకులుచెప్పు వాక్యములవలనను దెలియుచున్నదిగదా ? అదియంతయు నిట్లుండఁగాఁ గొంతకాలమునకు మునుపు మనహిందూ దేశమునుండి యమెరికా దేశస్థులును, నింగ్లాండు దేశస్థులును దీనిని గ్రహించినట్టు లీక్రింది కారణములవలనఁ దెలియందగు. మంత్రశాస్త్రమును గుఱించి చెప్పు గ్రంథములుగాని, మంత్రవేత్తలు గానియున్నటులనే యమెరికా దేశస్థుఁడుగాని యే యితర దేశస్థుఁడుగాని వారి పూర్వపు గ్రంథములయందు వ్రాయలేదు. మనపూర్వుల చరిత్రలయందు నెచ్చటఁబరిశీలించినను గొప్ప మహాత్ములైన యోగాభ్యాస పరులనుగుఱించియు, గొప్పమంత్రవేత్తలను గుఱించియు వ్రాసియుండుటవలన నీమంత్రశాస్త్రమునకు మన పూర్వులైన యార్యులే యాద్యులని నానమ్మకము. అయితే జనులందఱికిమెస్మరనునాతఁడీసమ్మోహనవిద్యను గనుఁగొనినటుల నమ్మకముగలదు. ఈ మంత్ర



శాస్త్రమును గొందఱు జనులితర దేశములకుఁగొని పోయినపుడు మెస్మరనునాతఁడు దీనిలోని స్వారస్యమును గ్రహించి మంత్రశాస్త్రమను పేరునకు బదులుగా వారి భాషయందుఁ దనపేర మెస్మరిజమని పేరిడిరి. అప్పటినుండి జనులందఱు నీమంత్రశాస్త్రమను పేరునకు బదులుగా మెస్మరిజమని వాడుచున్నారు. ఇప్పుడీవిద్య యితరదేశములందు ప్రబలమై మన యిండియా దేశమందెచ్చటను గాన్పించకున్నది. ఇందులకుఁ గారణంబరయ మనవారలకుఁ బట్టుదలలేమియు మన యిండియాదేశము వృద్ధికివచ్చుటకు నిచ్చలేక కాఁబోలు. ఈ తలంపు వారికి లేనట్లయిన నీసులభమైన విద్యను నేలవాడుక చేయరు? ఇప్పటికయినను దెలవిగలవారై యట్లు నేర్చుకొనఁదలఁచు వారెల్లరునీ చిన్నపొత్తమును జదివి యిందుఁజెప్పఁబడియుండు విదంబుననుసరించి యలవాటుచేసినయెడల నితర పుస్తకములయందుఁజూచి జేయుదానికంటె నెక్కుడు త్వరితముగా నేర్చుకొనఁగలవారని నానమ్మకము. కావున బుద్ధిశాలులందఱు నీచిన్నపొత్తమునందుండు సారాంశమును గ్రహించి వాడుకకుఁదెచ్చిన నభివృద్ధికి రాఁగలరని నాప్రార్థన.

వసిష్ఠ విశ్వామిత్ర నారదాదులును వారి చిన్నతనమునందు మనవంటివారే గదా, వారలు తెలివిగలవారలై మానవునిచేతఁగానిది యీ ప్రపంచంబున నెద్దియులేదనియు, భగవంతునికి నెంత శక్తిగలదో యంత శక్తి ప్రతి మనుజునికిని గలదనియు, భగవంతుఁడును గొప్ప మహిమగల మానవకోటిలోని వాఁడేయనియు, నట్లు మహిమగల మనుజుని గుఱించి యెప్పుడు స్మరించుచున్నందువలన వారికిఁ గల

మహిమ వీరికిని గలుగునని తలంచి యేకాంగులై నిర్జన ప్రదేశమునఁ గూర్చుండి తదేకధ్యాన్నపరులై భగవంతునిఁ గొలుచుచుఁ బ్రపంచమున్నంతకాలము వారి నామధేయంబును జనులందఱు స్మరించునట్లుగా గొప్ప మహిమగలవారలై యిప్పటికిని వారలే నిర్జనప్రదేశమునందో సంచరించుచున్నట్లుగా మన గ్రంథములు ఘోషించుచున్నవి గదా? అట్లు చెప్పుచున్న గ్రంథములను జదివియు మనవారలు తమ భార్యపుత్రాదులను విడచి యేకాంగులై యరణ్యములయందుఁ బడియుండుట కష్టమని యూహించి వీని నభ్యసించుట మానివేసిరి. నేనిప్పుడువ్రాయు సమ్మోహనశాస్త్రి మభ్యసించుట యతి సులభము. మనపూర్వీకులుచేయు పద్ధతులవలెఁ గాక యీకాలపు జనులందఱకు, నీసమ్మోహనవిద్య నభ్యసించుట యతి సులభముగానుండునటుల మిక్కిలి సులభమయిన యుదాహరణముల నిచ్చుచు వ్రాయుచున్నాఁడను. కావున దీని నభ్యసించుట కష్టమని యూహించక మన హిందూదేశమున నీ విద్యనునభ్యసించి మన దేశమునకు ఖ్యాతినిదేఁగలరని నేను నా మనస్ఫూర్తిగా నమ్ముచున్నాఁడను.

మెస్మరుదొరవారి జీవితము.

ఆంటోని మెస్మరను నాతఁడు రైనునదియొడ్డున స్టెయినను పట్టణములో 1734 సంవత్సరము మేనెల 5 తేది జన్మించెను. వారు వైద్యశాస్త్రమును జదివి, వియెన్నాయను దేశమునందు గొప్ప వయిద్యుఁడను బిరుదును వహించిరి. [illegible]తుని భక్తుఁడయిన హేహాలను నాతఁడు దేశములన్నియుఁ జుట్టి మాగ్నెటిజమను శక్తివలన ననేకములయిన



రోగములను నయముచేయుటను జూచి సంతోషమనస్కుఁడై దీనిని వాడుకచేయుటయందు నిచ్ఛగలవారైరి. తదుపరి వీరు 1750 సంవత్సరమున నీ చిన్న వయస్సుగల డాక్టర్ మాగ్నెటిజమునందుండు శక్తినిఁ కనుఁగొనవలెనని యుద్దేశముగలవారై వీరు సమ్మోహనవిద్య నభ్యసించుటకు మొదలుపెట్టి గొప్పశక్తిగలవారై, కొన్ని రోగముల మీఁదనుపయోగించిరి దానివలనివీరాకర్షణ శక్తియందు నధికగుణముగలదని కనుఁగొనిరి. తదుపరివీరుకొన్ని యుక్కుసంభందమయిన చెక్కలను దెచ్చి వాటియందు మాగ్నెటిజమునాకర్షణ శక్తిని నుపయోగించి కొన్ని రోగములను గుణపఱచుటకయి యుపయోగించిరి. అందువలనఁగూడ నధికగుణమునిచ్చినదని వారు కొన్ని గ్రంథములయందు వ్రాసియున్నారు. వీరు వియెన్నాదేశమును వదలి జర్మనీదేశము, స్విడ్జర్లెండు దేశము మొదలయిన దేశములనుజుట్టి యనేక విధములగు రోగములను నాశ్చర్యము గలుగునటులఁ బోఁగొట్టుచువచ్చిరి. వీరువైద్యులుగానున్నందున వీరికి గొంచమయినను తీర్పాటుండుట యరుదు గావున రాజులును, నింకను గొప్పవారును వీరినిఁజూచుటకై వీరికి యెప్పుడు సెలవుదినంబులు వచ్చునాయని వేచియుండువారలు వీరు 1778 సంవత్సరమునఁ బారిస్ దేశమునకు వెళ్లిరి. అచ్చట వీరుజనులందఱు నాశ్చర్యపడునటుల రోగములను బాగుసేయుటనుబట్టి యచ్చటిజనులందఱుదానిని నేర్చుకొనుటకునభిలాషగలవారై వారితోనేతిరుగుచువచ్చిరి. తదనంతరము వారలు కొద్దిగా గ్రహించినవారలై, వారి దేశంబున నొకసంఘము సొసయిటి నీసమ్మోహనవిద్యయొక్కగుట్టును గనుఁగొనుటకై యేర్పాటు

చేసిరి. ఆకాలమువఱకు (Somnambulisum ann Clair-voyance) నాకాలపు జనులవలనఁ గనుఁగొనఁబడలేదు. మెస్మరుమాగ్నెటిజమునుగురించిచెప్పినసంగతులలోఁ గొన్నిఁటి నిక్రిందదెలిపెదను, ఈ మాగ్నెటిజమనునది నరముల సంబంధమయినవానియందు, మిక్కిలి సులభముగాను మఱియు నానిమిషముననే గుణమునిచ్చును. ఈశక్తి యొకశరీరమునుండి మఱియొక శరీరమునకుమిక్కిలివేగముగా బ్రవేశించును. మఱియునిదిదూరముగానుండు శరీరములయందును మిక్కిలి వేగముగా బ్రవేశించును. ఈమాగ్నెటిజమనునది యద్దమునందు వెలుఁగునిచ్చును. ఇదియేవిస్తారంబైన శబ్దమునుఁగూడఁ గలుగజేయును. దీనివలననన్నివిధములగునరముల సంబంధమైన రోగములను దత్క్షణమే నయముఁ జేయవచ్చును. తక్కిన యితర జాడ్యములను దినములమీఁద బాగుజేయవచ్చును. ఎంత కష్టమయినదనియును, మందులవలన నయముకాని రోగమైనను నీశక్తివలన బాగుచేయవచ్చును. కొందఱికి నీయాకర్షణశక్తివలన నప్పుడు గుణమును గలుగఁజేయఁగలరే గాని తదనంతరము గుణముగానంబడదని వాదుచుండఁగా నేను బలుమాఱు వినియున్నాఁడను. గావున నట్లెంతమాత్రమును సందేహపడవలదు. దీనివలనఁ దుదముట్ట జాడ్యము నయముఁ జేవచ్చును. అట్లు బాగుగాఁబడిన రోగము, తదనంతర మెన్నటికిని గానంబడదు. ఈశక్తి మంచి గొప్ప మందుల శక్తికంటె దీనిమహిమ విస్తారముగావున, ప్రష్యా గవర్న మెంటువారా దేశమంతటను పాఠశాలలనేర్పఱిచి యీ సమ్మోహనవిద్యయందు నిపుణులుగానుండువారిని నుపాధ్యా



వారి పుస్తకమునందుఁ జెప్పియున్నారు. ఇంకను ఫ్రాంసుదేశమందును, జర్మనీదేశమందును, స్విడ్జర్లాండు దేశమందును, నిండియాదేశమందునునీసమ్మోహనవిద్యనునొకవస్తుశాస్త్రము (Science) క్రిందఁదీసుకొని తర్కించుచున్నారు. 1841 సంవత్సరమున, యర్ లాఫవున్ టెయిన్ అను ఫ్రంచిదేశస్థుఁడింగ్లండు దేశమునకు వెళ్లి యచ్చట నీ సమ్మోహనవిద్యనుగుఱించి యుపన్యాసములను గూడనిచ్చిరి. ఇతఁడు మాన్చెస్టరుకు వెళ్లి డాక్టరు బ్రెయిడు దొరగారికి దీనియందు నమ్మకము గలుగునట్లు చేసెను. ఇతఁడు దానినిగుఱించి చాలా సంగతులను గనుఁగొని యీ యాకర్షణశక్తిని మెస్మరిజమని పిలుచుటకు బదులుగా (Hypnotisum) సమ్మోహనమని పేరిడిరి. డాక్టరు బ్రెయిడుదొరవారు (Hypnolgy) సమ్మోహనశాస్త్రమను పుస్తకమును 1843 వ సంవత్సరమునవ్రాసి వెల్లడిచేసిరి. తదనంతరము స్పెన్సర్ టిహాల్ దొరవారును, కెప్టన్ హాడిసన్ దొరవారును వీరిద్దఱు నీ విద్య యందుఁ జాలా నమ్మకముగలవారై యీవిద్యను మిక్కిలి వృద్ధికిఁ దెచ్చిరి. తరువాత జి. అటికిన్సన్ దొరవారీ విద్యను గుఱించి యెక్కుడు పొత్తములనువ్రాసిరి. పైఁజెప్పినవారలు వ్రాసిన పుస్తకములను దీనియందు శ్రద్ధగలిగి వాడుకసేయు వారలు చదివినయెడల వారికి నధిక లాభకరముగానుండును. పైఁజెప్పినవారీ సమ్మోహనవిద్య నభ్యసించి యితరదేశములకు వెళ్లి యనేకములయిన జాడ్యములను బాగుచేసి చాలా ద్రవ్యమును సంపాదించిరి వీరలు డబ్బును సంపాదించుటయే ముఖ్యమైన యుద్దేశముగా నెంచుకొనక వారియొక్క దేశ

మునకు మేలుగలుగఁ జేయవలెనను తలంపువారికి విస్తారంబై యుండెను. వీరలు మంచి మనస్సుగలవారలై యనేక ప్రదేశములయందు ననేక బీదజనులకుఁ బ్రాణములనిచ్చియున్న వారలు. వీరిలోఁ గొందఱు నాటకశాలలందును లేక గొప్ప యిండ్లయందును వారియొక్క విద్యను వేడుకగాఁ జూపి డబ్బును సంపాదించుచు వచ్చిరి. అయితే వీరలు పైవిధమున వేడుకలను జేయుటను గుఱించి యోచింప వీరలితరులకు మేలుచేయు దానికిబదులుగా నితరులకు నష్టముఁ గలిగించుట గానంబడుచున్నదిగాని మేలు నా యభిప్రాయంబునఁ గానంబడలేదు. ఏలనన నీసమ్మోహనశక్తివలన నితరులను సమ్మోహకులనుగాఁ జేసినప్పుడు (అనగా వారి స్వాధీనము వారికిఁ దప్పునట్లు చేసినపుడు) మేము వారలచేత నేపనినయినను జేయించఁగలము గాన, వారిచే సారాయిత్రాగినవానిఁగాఁ జేసి యాడించుట, లేక వానికి నొక తోటనుజూపి యందు నొక కొలను గావించి, వాని కండ్లకుఁ జూపి యందులో వానినీదించుట, లేక వానినిఁ బిచ్చిపిచ్చిమాటలు మాట్లాడునట్లు చేయుట, యిట్లులోఁబడి పైఁజెప్పినప్రకారమాడు మనుష్యులను జూడ వచ్చినవారలందఱును జూచి పకపక నవ్వుట, చప్పటలు గొట్టుట, యివియన్నియు నచ్చటజరుగునుగాన నట్టి విద్య నేర్చినవారు జనుల నిట్లుచేయించుటవలన వారికి నవమానమును సిగ్గును గలిగించుచున్నారుగాన, వారికి నపకారముఁ జేసినట్లవుచున్నదే గాని, నాకుఁ జూడ లాభము కానుపించదు. ఏలనన వారిలోనుండు దేహపటుత్వమును లాగుకొనుటవలన వారలు బలహీనులగుట యొకటి, మనలోనుండు శక్తినిఁ బోఁ



యులనుగా నుంచి బాలురందఱికి నీ విద్యను నేర్పించుచు వచ్చిరి. మఱియు జనాయను దేశమందు నొక వైద్యశాల నియాకర్షణశక్తివలన రోగములను బాగుచేయుటకై నేర్పఱిచిరి. అచ్చట డయిరెక్టరుగానుండువారిని స్విడ్జర్లెండు దేశమునకు మెస్మరువద్దనుండి వీరి వైద్యమునకుఁ గావలసిన సంగతులను గనుఁగొనుటకై పంపిరి. వీరచ్చట సంగతులన్నియు గ్రహించినవారలై వారి దేశమున వారివైద్యశాలయందుండు వైద్యులకందఱికి నా సంగతులనన్నిఁటిని బోధఁ జేసి వారి వైద్యశాలను జాలా వృద్ధికిఁ దెచ్చిరి. బెర్లిన్ దేశములోనుండు తర్కశాస్త్రజ్ఞులు మెస్మరిజమునుగుఱించి గొప్ప సంగతులను నెవరు కనుఁగొనెదరో వారికి 3,300 ప్రాన్‌సెస్ నిచ్చెదమని వాగ్దానముఁ జేసియుండిరి. నాకుఁ జూడ నాలాగున గొప్ప బహుమతినిచ్చెదరన్నఁ బ్రతి మనుజుఁడును దానికిఁ గాను గష్టపడి యీ విద్యను నేర్చుకొని గొప్ప మహిమగలవారవుదురను నభిప్రాయముకలవారై యేలాగున డబ్బును ఖర్చుపెట్టి వారి దేశమునకు నెంత యుపకారముఁ జేయుచుండిరో మీరలాలోచింపుఁడు. ఇదియంతయు మనము వినినమాత్రంబున నెంత మూఢునకయినను మనస్సునఁ జింతకలుగక మానదు. ఇంకను రష్యా, ఆస్ట్రియా, బవేరియా గవర్నమెంటువారు మందులనుగుఱించి వారేలాగునఁ జట్టములనేర్పాటుచేసిరో యాలాగుననే యీ యాకర్షణవిద్య నుపయోగించుటయందుఁ గూడ వారు చట్టములను నేర్పాటుచేసి దీనిని వుపయోగించుటకై యుత్తరువులుచేసిరి.

మెస్మరు ఫ్రాన్సుదేశంబునఁ బెద్దజాతరలు జరుగునపుడు వారిస్వదేశమునకువెళ్లి యచ్చట నీవిద్యను జాలాకష్టపడి మిక్కిలి వృద్ధికిఁదీసుకొనివచ్చిరి. డాక్టరుమాల్ ఫాటి యనునాతఁడు వియెన్నాదేశంబున గొప్ప వైద్యుఁడు ఇతఁడు మెస్మరుచేయు పద్ధతులను వాడుకచేసెను. ఇతఁడును జనులందఱుఁనాశ్చర్యపడునట్లుగా ననేకములయిన గొప్ప గొప్ప జాడ్యములను బాగుచేసెను. 183౫ - వ సంవత్సరమున డాక్టరు యస్ డెయిలనునాతఁడు కలకత్తాలోఁ దని శక్తినిఁజూపియుండియా గవర్న్మెంటువారివలన మెప్పులనుబడసిరి. అతఁడు కలకత్తాలో రోగులనేకులను నిదురలోనుంచి వారికిఁ గలిగిన రాచపుండు, మేహవ్రణములు మొదలగు వానిని కొంచెమైనను రోగులకు నొప్పి గలుగకుండునటులఁ గోఁతలువెట్టి బాగుచేసెను. ఇతఁడచ్చట నూటయిర్వదియాఱ్గురి వ్యాధులను బాగుచేసినటుల నచ్చటి గవర్న్మెంటువారికి రిపోర్టుపంపఁబడినది. అందులోనాలుగురు మాత్రము కొంచెమయినను నొప్పినిపొందలేదనిచెప్పిరి. ఒకఁడుమాత్రము కొంచెముఁనొప్పిని అనుభవించినట్లుచెప్పెను. అయితే వానికినింకనితర సంగతులేమియుఁదెలియనటులఁ జెప్పెను. ముగ్గురునిమాత్రము నిదురలో నుంచుటకు వారికిసాధ్యపడలేదు. ఇదియంతయునచ్చటి గవర్న్మెంటువారుచూచియచ్చట నీసమ్మోహనవిద్యను నేర్పుటకు నొకపాఠశాల నేర్పఱచి, యచ్చటడాక్టరు పరీక్షకుఁజదువువారలందఱకు వారియొక్క పరీక్షయగునంతలో నాలుమాసములీసమ్మోహనవిద్యను నేర్పు బడియందియాకర్షణవిద్యను నేర్పుకొనుటులనుత్తరువుగూడఁజేసిరని జేమ్సు కోట్సు దొరవారు



గాపాడుకొనుటయే, కావునవివాహము జేసుకొనకుండుటయే యుత్తమమని నాయభిప్రాయము. కారణంబేమన నట్లు వివాహముఁజేసుకొనిన మనుజుఁడు ప్రతిదినమును సుఖమునుగోరక యుండఁడు. అట్లు ప్రతిదినమును సుఖమును గోరినందువలన శరీరముమందుండు నింద్రియపటుత్వము తగ్గిపోవును. కావునఁ బాణిగ్రహముఁ జేసుకొనకుండుటయే యుత్తమము. ఇట్లు చేసుకొన నిచ్ఛగలవారు, పక్షమునకు నొకమారైనను, లేక వారమునకు నొకతూరైనను వారితో సంసర్గముఁ జేయుచుండినట్లయిన శరీరము విస్తారముగాఁ జెడకయుండును. అట్లు శరీరపటుత్వము తగ్గనందువలన నీ సమ్మోహనవిద్య నభ్యసించుటకు విసుకుఁజెందక కష్టపడి నిర్జనప్రదేశమున గంటలకొలఁది కూర్చుండి యభ్యాసముసేయుటకు శక్తిగలవారలై తమ యొక్క విద్యను ద్వరితముగాఁ బట్టుపడులాగున శ్రద్ధను వహించి యభ్యసించుటకు శక్తిగలిగియుందురు.

4. తదుపరిపైఁజెప్పినగదియందు శుభ్రమైనపీఠమునందు గాని లేక కృష్ణాజనముమీఁదగాఁని కూర్చుండి నల్లని బొట్టును నొసటధరించి ముఖమునకుముందు జానెడుదూరమున నద్దమునుంచి యా యద్దమునందుఁ బ్రతిఫలించు బింబము యొక్క కనుబొమ్మల మధ్యనుండు బొట్టును నేక దృష్టితో ఱెప్పలార్పక పదునేను నిమిషములవఱకుఁ జూచునంత శక్తి గలుగునంతవఱకు యిట్లుసేయవలయును. అట్లుచేయునపుడు నేత్రములకు నీరువచ్చుచున్నను, మంటగానున్నను చల్లని నీళ్లఁ దడుపుచురావలయును. అట్లు కొన్నిదినములు గడచినంతనే కన్నీరుగాఱుటతగ్గిపోవును, అప్పటినుండి నీకు దేనియందైనను

దృష్టిని నిలుపుట కడుసులభమగును. తదనంతరము చీట్లి కాగితమంత తెల్లని యట్టనుగైకొని దాని మధ్యభాగంబునఁ బరకరూపాయంత నల్లని చుక్కనువ్రాయవలయును. అట్లు వ్రాసినపత్రమునుదెచ్చి గోడకుగాని లేక స్తంభమునకుఁగాని తగిలించి దానికి మూరెడుదూరము ముందుభాగమునఁ గూర్చుండి యేకదృష్టిని.(అనఁగా రెప్పలార్పక దృష్టిని: జుక్కయందేయుంచి) చూచుచుండవలయును. అట్లు కొంచెముసేపు చూడఁజూడ నా నల్లనిచుక్క కండ్లకుఁగానరాక యదృశ్యమై నల్లని చుక్కకుబదులుగా నొక తెల్లని కాంతిగల చుక్క కానంబడు, దానిప్రకాశముఁజెప్పుటకు నలవిగాదు. దానినేమనవారలు జ్యోతియని వాడుదురు. అట్లు గనఁబడిన జ్యోతినిఁజూడఁదగినంత శక్తిగలిగినపుడు వానికి (Gaze) దృష్టి వచ్చినదని తలంచవలయును. అట్లు దృష్టి వచ్చినదని తలచిన మనుజుఁడే సభలోనికైనను వెళ్లినపుడు వానికి దృష్టివచ్చినదా లేదా యని పరీక్షించుటకై యచ్చటఁ గూర్చుండియుండు మనుజులలో నొకనిముచ్చలిగుంటను నేకదృష్టితోఁ జదేక ధ్యానపరుఁడై "నీవిప్పుడు నా ప్రక్కకు మళ్లెద" వని మనస్సునఁ దలంచుచుండవలెను.

అట్లు చేసిన యొకటి రెండు నిమిషముల లోపుగానే నీవుతలఁచినటుల నెఱవేఱును. అట్లు నెఱవేఱిన నీకుదృష్టి వచ్చినట్లును లేనిపక్షమునఁ నీవిద్య తనకు లభించదని మాని వేయక పట్టుదలగలవారై, మరల దృష్టినిఁగొన్ని దినముల వఱకు వాడుక చేయవలసినది. ఎల్లప్పుడును దృష్టినివాడుక చేయు మనుజుఁడు తానభ్యసించునపుడు తన మనస్సున నేను



గొట్టుకొనుట రెండు. కావున నీ విద్యచూపరులకుఁ జూపించి సంతోషపెట్టినందునవలన మనము డబ్బును సంపాదించుచున్న వారల మవుచున్నారమేగాని యితరులకు మేలుచేయువారము గాము. ఇవి యన్నియునాలోచింప మన బుద్ధికి నేలాగునఁ గానంబడుచున్నదో చదువరులకే విశదముగాఁగలదు. కావున పైఁజెప్పబడిన విద్యను నభ్యసించుటకై యుండవలసిన విధులను నలవాటుచేయు పద్ధతినిఁజెప్పెదను. చదువరులందఱు ముఖ్యముగా గమనించవలయును.

# సమ్మోహనవిద్య

## అభ్యసించువారలుండవలసిన పద్ధతులు.

1. ఈ సమ్మోహనవిద్య నభ్యసించువారలు గొప్ప పట్టుదలయు నోర్పునుగలిగి, మంచిస్వభావముగలవారలై యాసక్తితో గొప్పస్నేహభావముగలిగి ప్రాణకోటియందు ప్రేమగలవారలై, మానవకోటితోఁ బశ్చాత్తాపమును దయనుజూపు మృదుమధుర వాక్యములతో మాటలాడుచు, వారలు సెప్పు దానిని శ్రద్ధగానాలకింపుచు వారలుచెప్పుదానికడ్డుసెప్పక వారి వాక్యములవలన వారినేతృప్తిపఱచుచు, ననవసరమగుదానిని గుఱించియధికముగా మాటలాడక సాధ్యమయినంతమట్టుకుఁ బ్రసంగములను మానుచుఁదమయొక్క గుణములనుగుఱించి తాము పొగడుకొనక, తాము సేయఁదలఁచినదానియందే బుద్ధిని నిలిపి శ్రద్ధగాఁబాటుపడినట్లయిన నట్టివారు త్వరితముగా నీ సమ్మోహన విద్యయందు నిపుణులయ్యెదరు.

2. ప్రతి మనుజుఁడును సూర్యోదయము గాకమునుపే నిదుర మేల్కొని, నిర్జన ప్రదేశమున నేకాంగియై చల్లనీళ్లు స్నానముఁ జేయుచు "నేనిప్పుడు స్నానముసేయు నీళ్లయందుండు మంచిశక్తిని లాగుకొనుచున్నా" నని మనస్సునఁ దదేకధ్యాన పరుండై ప్రతిదినమును స్నానము సేయుచుండవలయును, అట్లు చేసిన తదనంతర మేకాంగియై నిశ్చలముగా నుండు ప్రదేశమున నిలిచి తనవక్షస్థలమును ముందుకు విఱిచి తలనెత్తి చేతులను నడుము రెండుప్రక్కలయందు వ్రేలాడవైచి "నేనిప్పుడు గాలియందుండు మంచిశక్తిని లాగుకొనుచున్నా" నని మెల్లఁగా గాలినిలోనికిఁ బీల్చి, విడుచునపుడు "నాశరీరమునందుండు చెడ్డశక్తిని బయటికివిడుచుచున్నా" నని యేకమనస్సుతోఁ దలంచుచు గాలిని మెల్లఁగా లోనికిఁ బీల్చి మెల్లఁగా విడుచుచుండవలయును.

3. దీనినభ్యసించు వారలెల్లప్పుడును సంతోషమనస్కులై తనకు సాధ్యమైనంతమట్టుకు శరీరమును శుభ్రముగానుంచుకొనుచు, మఱికివస్త్రములను ధరించక, ప్రతిదినమును శుభ్రమైన వస్త్రములను ధరించుచుఁ, బ్రతిదినమును దానుగూర్చుండుగదిని శుభ్రముగానుంచి, పుష్పములు మొదలగు సుగంధ ద్రవ్యములచే గదినలంకరించి దానినుండివచ్చు మంచివాయువునాఘ్రాణించి సంతోషమనస్కుఁడై యుండవలయును. ఈ విద్యనభ్యసించువారలు పైఁజెప్పియుండు గదులకు నితరమనుజులనేరినైనను రానీయకుండవలయును. అప్పుడే యాగది శుభ్రముగానుండునుగాని, లేనియెడల నట్లుండనేరదు. ఈ యభ్యాసమునకు ముఖ్యముగా గమనించవలసినది శరీరమును



(మాగ్నెటిజం అను) మంచి శక్తి తొందఱగాఁబ్రవేశించును, గనుక నట్లుపయోగించెదరు. పైకారణములవలన దృష్టియందు శక్తియున్నటుల మీరు కనుఁగొనవచ్చును. మనపూర్వీకులు పైఁజెప్పిన దృష్టినివాడుక సేయుటకునేఁ జెప్పిన పద్ధతులననుసరించియేగాక, వారలు నిర్జన ప్రదేశమునఁ గూర్చుండి తనయొక్క నాసికాగ్రమునఁ జూపునునిలిపి దృష్టిని వాడుక సేయుచువచ్చిరి. అయితే నేను జెప్పఁబోవు దానియందును దనంతటఁ దానిష్టానుసారముగా నిద్రావస్థ దెప్పించుకొనవలెననితలఁచినప్పుడు తనయొక్క దృష్టిని నాసికాగ్రమున నిలిపి మనస్సుల నిద్రించవలెనని యేకమనస్సుతోఁ దలఁచినయెడల, వారలకు రెండుమూడు నిమిషములలో నిద్రవచ్చును. అట్లు నాసికాగ్రమునదృష్టిని నిలుపుటకు గొంతవాడుక చేయవలసియున్నది. అది యెలాగన నీవు దృష్టిని ముక్కుకొనయందు నిలిపినపుడొకటి రెండు నిముషములలో ముక్కుగానంబడక యొకప్రకాశమైన జ్యోతిగానంబడు. ఆజ్యోతిని గొన్ని నిమిషములవఱకుఁ జూచుటవాడుక సేయవలయును. అట్లుచేసిన యనంతరము నీ యిష్టానుసారముగా నీవు నిదురకలుఁగఁజేసుకొనవచ్చును. (దీనినే మనవారలు Self Hipnotism, అని వాడెదరు.) అనఁగా దనంతటఁ దాను మోహాకుఁడవుట యనియర్థము. దీనిని బాగుగానేర్చిన యనంతరము తనయొక్క దేహమునందుండు ప్రత్యవయవమును స్వాధీనము దప్పునటులఁ జేయుటకు శక్తి గిలుగునంతవఱకు వాడుక సేయవలయును. అట్లు చేయుటకుఁగాను గొన్ని సులభమైన మార్గములను జెప్పెదను. నీవు మిక్కిలి సులభముగాఁ

కూర్చుండుటకు వీలుగానుండు సోఫామీఁదగాని లేక సులభముగా బరుండుటకువీలుగానుండు వాలుకుర్చీమీఁదగాని పండుకొని నీయొక్కయెడమచేతినినెత్తి, దానిక్రిందిభాగమునందు, నీ కుడిచేతియొక్క వ్రేలిని పైచేతికి నాధారముగానుంచి, నీచేతియందుండు నరములనన్నిఁటిని బలహీనమగునటులఁజేయవలయును. అట్లు నీవు నీచేతిని బలహీనమగునటులఁజేసిన వెనుక నీ పైచేతికి నాధారముగాఁబెట్టిన చేతినిఁదీసి వేయవలసినది. అట్లు నీవు చేతినిఁదీసినతత్క్షణమే నీచేయి యచ్చటనిలువనేరక, క్రిందఁబడిపోవును. అట్లు ప్రతిభాగమును స్వాధీనముదప్పనటులఁజేయుశక్తి నీకుఁగలిగినయెడల నీవుగొప్పమహిమగలవారిలో నొకఁడవనఁబడియెదవు. దీనివలన సమాధి నియమనముగలుగఁజేసికొనవచ్చును. అట్లు సమాధిఁజేయుటకు విధము రాఁబోవునధ్యాయములందుఁజెప్పెదను.

### మనపూర్వీకుల పద్ధతులు.

నేనిప్పుడు మనపూర్వీకులుపయోగించు వస్తువులయందుండు మంచిశక్తిని నుపయోగించువిధమును జెప్పఁదలచితి గావున బుద్ధిశాలులందఱు శ్రద్ధగాఁగమనించవలసియుండును. అవి యెవ్వియన, మనపూర్వులు తులసిదళమును భగవంతునికి మిక్కిలి ప్రీతిగలవస్తువనియు, నట్లు ప్రీతిగలవస్తువును భగవంతునికి నారాధనచేసినందున భగవంతుఁడు మనయందు దయగలవాడై యుండుననియుఁ జెప్పుటను మనము పలుమాఱు వినియున్నారము. కనుక మనవారలా తులసిదళములను దీర్ఘములతోడఁగాని. లేక దళములుగాగాని, పూజఁజేసి



గొప్ప సత్తువగలవాఁడను, నా దేహమునం దేరోగమును లేదు. నేనధికారోగ్యవంతుఁడను. నాకంటెగొప్ప మహిమగలవాఁడితరుఁడెవఁడును లే" డని మనస్సునఁదలచుచు దృష్టిని వాడుక చేయవలయును. అట్లు చేయుటవలన నీశరీరమందుండు రోగములన్నియునశించి, మంచియారోగ్యవంతుఁడవై యావిద్యను వాడుకసేయుటకు గొప్ప పటుత్వముగలవాఁడవగుదువు. అట్లుచేసి మనశ్శక్తిని దేహపటుత్వము, సంపాదించిననుతదుపరి, యే గొప్పవానివద్దకైనను నీమాటనంగీకరించవలెనను నుద్దేశముతో వెళ్లినప్పుడు మొట్టమొదలు చేయవలసిన దెద్దియనఁగా:——

వెళ్లినతోడనె నీయొక్క దృష్టిని నతనియొక్క కనుబొమ్మల మధ్యభాగమున నిలిపి నీయొక్క మనస్సున నీవు కోరఁబోవు సంగతులన్నియు సిద్ధించుఁగాక యని తలంచవలెను. నీవట్లు చేసినపిదప, నీకార్యము సిద్ధించినట్లయిన నీకు (Gaze) అనఁగా దృష్టి వచ్చినదనియును, లేనియెడల దృష్టిరాలేదనియును నెఱుంగునది. మనవారలందఱు దృష్టియనుమాట పలుమాఱుపయోగించుటను వినియున్నారు గదా? అనఁగా వారల బిడ్డలకు దృష్టితగిలినదనియును విభూతిపెట్టించినందువలన నది నశించుననియుఁ జెప్పుటనుగూడ వినియేయున్నవారలు. అట్లుజెప్పినదానికిఁ గారణంబేమనఁ, గొందఱికి నేత్రములు స్వాభావికముగాఁ గొన్ని సమయములయందు దృష్టిని నిలుపుటకు శక్తిగలిగియుండును. వారలనే మనము దృష్టిని నుపయోగించమనిన నుపయోగించుటకు వారికిఁ జేతఁగాదు. ఆచూపయినను గొన్ని సమయములయందతనికిఁ

దెలియకయే నిలుచుచున్నదిగాని, యితని యిష్టానుసారముగా నది గలుగుటలేదు.

అట్లుపయోగించిన దృష్టివిభూతి పెట్టినమాత్రమునతగ్గుటకుఁగారణంబేమి ? అదియును జెప్పెదవినుఁడు. విభూతిని మంత్రవేత్త చేతికిఁదీసుకొని తన దేహమందుండు మంచిశక్తిని విభూతిలోనికి ప్రవేశింపఁజేసి యితరుఁడుపయోగించిన చెడ్డశక్తినశించునట్లుగాఁజేసి యా విభూతిని వీరికనుబొమ్మల మధ్య భాగమునను పయోగింపఁజేయును. అట్లు కనుబొమ్మల మధ్య భాగమునను పయోగించుటకుఁ గారణంబేమనఁ, కనుబొమ్మలమధ్యనుండు నరములమీఁద (Magnetisum) అనఁగా మంచిశక్తి వేగముగాఁ ప్రవేశించి గుణముసేయును. అంత వేగముగా నింకనేచోటనుపయోగించినను గుణమునీయఁనేరదు. కావున నచ్చటనుపయోగించుటయే యుత్తమము. నాయొక్క యనుభవములో నేను వేలకొలఁది బిడ్డలకును పెద్దవారికిని దృష్టికిఁగాను విభూతిపెట్టి బాగుచేసియుంటిని. నాయొక్కయనుభవములో నేను గొన్ని సంగతులనుగనుఁగొంటిని అదియెద్దియన నేనెచ్చటనయిన విభూతి పెట్టుటకు మొదలు పెట్టఁగానే వారికి దృష్టియున్నయెడలనాకు విశేషముగా నావులింతలు వచ్చుటగలదు. అందువలనాకావులింతలు గలిగినయెడలవారికి దృష్టియున్నట్లును లేనియెడల వారికి దృష్టిలేనట్లును గనుఁగొంటిని. ఇది నాయనుభవము వలన గనుఁగొనినదేగాని మఱి యితరులవలన వినివ్రాసినదిగాదు. జనులందఱును నితరవస్తువులను నుపయోగించక ముఖ్యముగా విభూతి నుపయోగించుటకుఁ గారణం బేమనదానియందు



ఇప్పుడమెరికా దేశమున విశేష భాగమీ యాకర్షణ శక్తి వలన రోగములను బాగుసేయించుకొనుచున్న వారలేగాని, వారెంతమాత్రము మందుల నుపయోగించుటలేదు. కనుక మన దేశమునకును నట్టిస్థితి యెప్పుడు గలుగునాయని వేచియున్నవాఁడను.

### రావి చెట్టునందుండు మహాశక్తి.

మనము దయ్యములు పట్టిగాని లేక యితర యే జాడ్యము వలననయినను బాధపడుచున్నపుడు రావి చెట్టునకుఁ బ్రదక్షిణములు చేసినయెడల పైఁజెప్పిన రోగములన్నియు నశించునని మనపూర్వీకులు చెప్పియుండిరి. ఆప్రదక్షిణములు సేయునపుడు దినమునకు నొకమాఱు భోజనముచేసి స్నానముఁజేసి మంచి వస్త్రములను ధరించి ప్రదక్షిణములు జేయమని చెప్పిరి. మన పూర్వీకులట్లు చెప్పుటనుబట్టి మనము వారలు చెప్పినప్రకారము చేయుట గానంబడుచున్నదేగాని, యందులఁ గారణము మనవారలకునిప్పటికిని గోచరముగా నందుకు నేను జింతించున్నాఁడను. దానికిఁగారణంబేమన. రావిచెట్టునందు మంచి మనస్సుగలిగినట్టియు, నారోగ్యవంతుండైనట్టి మనుజునియందుండు మంచిశక్తినిఁబోలుశక్తి విస్తారముగానుండుటంబట్టి, యా చెట్టు చుట్టును మంచి మనస్సుతో, దానియందే బుద్ధిని నిలిపి ప్రదక్షిణములు చేసినయెడల నా చెట్టునందుండు (Magnetism) మంచి శక్తి యీ ప్రదక్షిణములు సేయువానియందుఁ జొరబడి వాని దేహమునందలి రోగములను నశింపఁజేయును.

ఱియు నితరులెవరైనను రోగముచేఁ బీడింపఁబడుచున్నపు

డారోగి నడచుటకు శక్తిలేనిసమయంబునఁ బ్రదక్షిణములు చేయుటకు సాధ్యముగాదు. అట్లు సాధ్యముగాని సమయంబున నారోగికి నిష్టులుగానుండువారిని అనఁగా నారోగికి మేలుగోరువారిని రావిచెట్టునకుఁ ప్రదక్షిణములు చేయించవలయును. అట్లు ప్రదక్షిణము లితరులకుఁగాను జేయునపుడు, మంచి స్వభావముతో నాశక్తిగలిగి తనయొక్క భర్తయందుండు రోగము నశించుఁగాక యని తనయొక్క మనస్సును చెట్టునందు నిలిపి ప్రదక్షిణములు సేయవలయును. అట్లు చేయుటవలన నాచెట్టునందుండు మంచి శక్తి ప్రదక్షిణములు చేయువానియందుఁ బ్రవేశింపక మనస్సును నెవరియందు నిలపిరో వారియందే ప్రవేశించునుగాని ప్రదక్షిణములు చేయువానియందెన్నటికిని, బ్రవేశింపదు. ఎప్పటికినిఁ బ్రదక్షిణములుసేయు మనుజుఁడు తనకుగాను జేసుకొనునపుడు తన దేహమందుండు రోగము నశించుఁగాక యని మనస్సున దలఁచుచు బ్రదక్షిణములు సేయవలెను. ఇతరుల బాగునకుఁ గానుఁ జేయునపుడు రోగికి బాగుగావలెనని మనస్సునఁ దలఁచుచు నితరసంగతి నెట్టిదానినైన మనస్సుననుంచక తదేకధ్యాన్నపరుఁడై చేయవలెను. అప్పుడు రోగికి నెమ్మది కానంబడునేగాని, నేను పైజెప్పినప్రకారము సేయనియెడల గుణము కొంచమైనను గానంబడదు. కావున రావిచెట్టునకుఁ బ్రదక్షిణములు సేయువారలు నేను పైజెప్పినప్రకారము సేసినయెడల వారికిఁజాలా లాభము గలుగునని మనస్పూర్తిగానమ్మి యిచ్చట వ్రాసినాఁడను. కావుచ రోగులుకాని వారును పై ప్రకారము సేసినందువలన వారికిని చాలా



వానినిఁ బ్రసాదముగా నెంచి భక్షించుట గలదు. ఇట్లు జనులందఱు నుపయోగించుచున్నను, పై నుదహరించిన కారణము దప్ప, నితరకారణము వారికి గోచరముగానందుకు మిగులఁ జింతించుచున్నాఁడను. మనపూర్వీకులు మనలను మూఢులుగానెంచి మనలకుఁ దుఃసిదళములు భగవంతునికిఁ బ్రీతిగలవస్తువని చెప్పినఁగాని మనము శ్రద్ధగలిగి దానిని నుపయోగించమని యట్లు చెప్పిరి, దానిచే మన పూర్వీకులకు నిజమైనకారణము తెలియదని తలంచవలదు, వారలట్లు జెప్పుటకుఁ గారణమెద్దియన తులసిచెట్టునందు, మంచి స్వభావముగలిగినట్టియు, మంచి యారోగ్యవంతుఁడై నట్టి మనుజునియందుండు మంచి శక్తి (Magnetism) నిఁబోలుగుణమున్నందున దానిని నీళ్లయందుంచినయెడల నా యాకులయందుండు శక్తి నీళ్లయందుఁ బ్రవేశించును. అట్టి శక్తి ప్రవేశించిన తీర్థమును ద్రాగినందువలన మన దేహమునందలి రోగములును, దుశ్శక్తియు నశించి మంచి గుణము నిచ్చును. కావుననే మన పూర్వీకులు దానిని భగవంతునికి బ్రీతిగల వస్తువని యనినఁగాని మూఢులమైన మనముపయోగించమని దలఁచి యీలాగుచెప్పిరేగాని, నేనుజెప్పిన కారణము దప్ప మఱియే యితర కారణమును నాకు గాన్పించలేదు. మఱియు మనవారలు తులసిమ్రానును బూసలుగాఁజేసి దానిని నొక త్రాటియందు గ్రుచ్చి యొక మాలగాఁజేసి దానిని మెడయందు ధరించెదరు. అట్లు ధరించినందున నా పూసలయందు (Magnetism) మంచి శక్తి శరీరములోఁ బ్రవేశించి మంచిచేయునను నుద్దేశముతోనేగాని, లేక యట్లు ధరించి

నందున భగవంతునియొక్క శిష్యులుగాఁ గనఁబడుటకుఁగాని లేక చక్కఁదనమును నిచ్చునదిగాని మన పూర్వీకుల యుద్దేశముగాదు. మఱియుఁ గొందఱికి నీ (Magnetism) శక్తి వలన రోగములు పోవుటకుఁగారణంబేమని సందేహముగలదు. ప్రతి జంతువునకును, లేక ప్రతి మానవునికిని శిరస్సొక భాగముగాను శరీరమంతయు మఱియొక భాగముగాను విభజింపఁబడి యున్నది. గావున 100 భాగములు (Magnetism) తలయందును 100 భాగములు శరీరమంతయు నుండునుగాన, మనశరీరమునవెచ్చోటనయినను నీ (మాగ్నెటిజం అను) మంచి శక్తి తలయందైనను లేక దేహమందైనను తగ్గిన సమయంబున మనకు రోగముగాఁ గానంబడును, అట్లు రోగముచేఁ బీడింపఁబడుచున్నపుడు మెస్మరిష్టు (మంత్రవేత్త) తన శరీరమందుండు మంచి శక్తిని నారోగియొక్క శరీరమందుఁబ్రవేశింపఁజేయును. అట్లువై ప్రకారము చేసినందువలన వాని శరీరమందు మంచిశక్తి తగ్గినభాగమునఁజేరి వానియొక్క రోగమును తుదముట్టనయముసేయును. కావునఁ బ్రతిమానవుడును రోగముచే నవస్థపడునపుడీ యాకర్షణశక్తిచే బాగుచేయించుకొనుట మందులు తినుదానికంటె నుత్తమమని నాయభిప్రాయము. ఏలనన మందులయందు మంచి శక్తియుఁ గొంత వృథాపదార్థమును నుండుటంబట్టి రోగము నయమైనప్పటికినీ వ్యర్థపదార్థమువలన దేహమునకుఁ జెఱుపు గలుగుచున్నది. గావునఁ బ్రతిమనుజుఁడునట్లు చెఱుపుఁజేయు మందులను దిని దేహమును జెడగొట్టుకొనుటకంటె నీ గొప్పమహత్తుగల యాకర్షణశక్తివలన బాగుసేయించుకొనుటయే యుత్తమము.



లాభముగలుగునుగాన శ్రద్ధను వహించిచేసి జనులందఱు బాగుపడుదురుగాక యని నేను గోరుచున్నాఁడను.

బొట్టునుపయోగించుటకుఁగారణము.

మన యిండియా దేశంబున జనులందఱు బొట్టును నొసట ధరించువాడుకగలదు. ఎందువలనన్న, మన పూర్వీకులీ వాడుకను జేయుటవలన మనము చేయుచున్నారమేగాని మనకు దానిని యుపయోగించుటవలన వచ్చులాభనష్టములు తెలియవు. గావునమూఢులమైన మనము మనపూర్వీకులను నిందించుచు, యేదేశమందును లేనివాడుకను మనకేల దెచ్చి పెట్టిరనివాడుచున్నారము. వారలు మనలను బొట్టునుపయోగించమని చెప్పినందునవారలకుఁ దెలివి తక్కువయని యెంచవలదు. వారలట్లు చెప్పుటకుఁగారణంబేమన, నితరులెవరైనను మనలను జూచునపుడు, మొదట ముఖమునుజూచు వాడుకగలదు. అట్లు ముఖమును జూచినందునఁ గొన్ని సమయములయందు వారు దృష్టిని నుపయోగించుటగలదు. మనము బొట్టును నొసటధరించినందునఁ జూపరులయొక్కదృష్టి మన ముఖమునందుఁబడక, మనయొక్క బొట్టునందు వారిదృష్టి నిలుచుచున్నది. కావున మనయందు నితరులుపయోగించిన దృష్టి మనకుఁ జెఱుపుసేయదు. కావునఁ బ్రతిమనుజుఁడును బొట్టును వుపయోగించుటకుఁ బైఁజెప్పిన కారణముదప్ప నితరకారణము నాకుఁగాన్పించలేదు. కావునప్రతి మనుజుఁడు మనపూర్వుల నునిందించక బొట్టును ధరించి బాగుపడెదరని నేనునమ్ముచున్నాను. బొట్టును భగవంతునియొక్క పాదములని పెద్దలైన

మన పండితులు కొందఱు పలుమాఱు చెప్పుటను నేను విని యున్నాఁడను. అది వారల తలంపేగాని మన పూర్వుల తలంపు కాదు. మన పూర్వీకులు మనలను మూఢులుగా నెంచి చెప్పినదానిని నమ్మి మనవారలిప్పటికిని జేయుచున్నవారలేగాని, నిజమైన కారణముఁ దెలుసుకొని యట్లు చేయుట లేదు. మనవారలట్టి నిజమైన కారణము నెఱుంగకయే మన పూర్వులు చెప్పినదానినిఁబట్టి జేయుచున్నవారలు కావున, వారలు బొట్టునుధరించి బాగుపడుటయే నా ముఖ్యోద్దేశము.

### ఆకర్షణశక్తి వుపయోగించు విధము.

పై భాగములయందు మోహనవిద్య నభ్యసించు విధమును, నాకర్షణశక్తినిగుఱించియు (Human Magnetism) వ్రాసియున్నాఁడను. కనుక నిప్పుడువ్రాయునది (Human-Magnetism) నుపయోగించు విధము. అది యెట్లన, దీనిని నుపయోగించుటకుఁగాను దీనిని వాడుకసేయు ప్రతి మనుజుఁడును, హస్తసంచాలనమును (Passes) వాడుక సేయవలయును. హస్తసంచాలనమనఁగా, రెండుచేతులను దెఱచి వ్రేళ్లను కొద్దిగా వంచియేమనుజునకు జాడ్యము బాగుసేయఁదలఁచితివో వానియొక్క తలమొదలు కాళ్లవరకును రెండు చేతులతో విసిరినట్లు విసరినదానిని హస్తసంచాలనమనెదరు. అట్లు హస్తసంచాలనము సేయునపుడు నీ రెండు చేతులు కాళ్లవఱకు వచ్చిన పిమ్మట వ్రేళ్లనువిదళించి, మరల, రెండు హస్తములను తలయొద్దకుఁబోనిచ్చి, కాళ్లవఱకు హస్తసంచాలనముఁ జేయవలయును. ఇట్లొక యఱగంటవఱకు



గష్టపడకయు, నాయాసపడకయుఁ జేయునంత శక్తిగలుగునంతవఱకు వాడుకసేయవలయును. అట్లు వాడుకసేయుటకుఁగాను మొదలొక కుర్చివేసుకొని దానియందు మనుజుఁడు కూర్చున్నాఁడని యుద్దేశముగలవాఁడవై, యా కుర్చిమీఁద నేనుబై చెప్పినవిధమున హస్తసంచాలనము వాడుక సేయవలయును. అప్పుడు నీవు హస్తసంచాలనము సేయుటకు నెంతమాత్రమును గష్టమును జెందవు. పై విధమున నీవు హస్తసంచాలనమును బాగుగా వాడుకజేసిన పిమ్మట యే మనుజుఁడైనను రోగముజే బాధపడునపుడు, నీవు వానికి బాగుసేయఁదలఁచినయెడల, నేను బై చెప్పినవిధమున హస్తసంచాలన మఱగంటకాల మారోగిమీఁద నీయొక్క దృష్టిని నిలిపి, మనస్సునందు నితరమైనదానిని గుఱించి దలఁచక యేక మనస్సుతో రోగికి రోగము బాగగునుగాక యని యుద్దేశముగలవాఁడవై, హస్తసంచాలనమును దలమొదలు కాళ్లవఱకుఁ జేయవలయును. అట్లు నీవు హస్తసంచాలనముఁ జేయునపుడు రోగికిఁ గొన్నిసమయములయందు నిద్రావస్త గలుగును. అట్టి సమయమున రోగికిఁ త్వరితముగా రోగము నివారణమగును. అట్లు నిద్రావస్తనుజెందకయున్నను రోగము నివారణమగును. అట్లు రోగము నివారణమగుటకుఁ గారణం బేమన నీవు హస్తసంచాలనముఁ జేయునపుడు నీ దేహమందుండు (Human Magnetism) నీయొక్క గోళ్లనుండి వెలుపలికివచ్చి రోగియొక్క శరీరమునఁ బ్రవేశించి గుణము నిచ్చును. నీవెల్లప్పుడు రోగులకు బాగుసేయఁదలఁచిన మంచి స్వభావము గలవాఁడవై, యా శక్తితో హస్తసంచాలనముఁ

జేయవలయును. నీవు భోజనముఁ జేసినవెంటనేగాని లేక ఎక్కిలి యాకలిగానుండు సమయములయందుఁ గాని, మఱియు రోగముచేఁ బీడించఁబడుచున్నపుడుగాని, రోగి మీఁద నీయొక్క శక్తినుపయోగించఁగూడదు. దీనికి ముఖ్యముగా నుదయము పూటగాని లేక రాత్రివేళఁగాని, హస్తసంచాలనము చేతనైనను, లేక మఱి యేవిధముననైనను రోగిని బాగుచేయుటకుఁదగిన కాలము. మఱియు రోగిని బాగుఁజేయుటకు నీవుద్దేశపడినపుడు కొంచెము ఫలహారముఁజేసి నీయొక్క శక్తిని రోగియందుపయోగించుట యుత్తమము. ఎల్లప్పుడును రోగిని నొక కుర్చీమీఁదఁగూర్చుండఁబెట్టి నీవు రోగికియెదురుగాఁ గొంచెమెత్తుగానుండు కుర్చీమీఁదఁగూర్చుండి నీయొక్క రెండు కాళ్లను వానియొక్క రెండు కాళ్లప్రక్కలనుంచి వానియొక్క బొటనవ్రేలినీయొక్క యెడమచేతి బొటనవ్రేలిచే నొక్కిపట్టి హస్తసంచాలనమును జేయవలయును, ఎల్లప్పుడును మంత్రించువారు తూర్పు ప్రక్కఁదిరిగి కూర్చుండుట యుత్తమము. హస్తసంచాలనముఁ జేయునపుడు, తల మొదలు కాళ్లవఱకు రానిచ్చిన (Long Passes) అనియు, తల మొదలుకొని నడుమువఱకు రానిచ్చిన (Short Pesses) అనియుఁ జెప్పెదరు. సాధారణముగా కాళ్లవఱకు రానిచ్చుట చాలాయుత్తమము. ప్రతి హస్తసంచాలనమునకును జేతులనువిదలించు చుండవలయును. ఇట్లు జేతులను విదలించుట యెల్లప్పటికిని జ్ఞాపకముంచుకొనవలసియుండును. కొన్నిసమయములందు హస్తసంచాలనము జేయునపుడు నిద్రవచ్చునని చెప్పియుంటినిగదా? దానిని



మరలఁబోగొట్టుటకై కాళ్లుమొదలు తలవఱకును హస్తసంచాలనముఁజేయవలయును. అట్లు చేయునపుడు నీమనస్సున "నీవు నిదురనుండి మేల్కొనెదవుగాక" యని తలంచవలెను, లేక మెల్లగా రోగికి వినఁబడునటుల, 'నీవు నిదుర మేల్కొనెద' వని చెప్పవలెను. అట్లు హస్తసంచాలనముఁ జేయుటవలన రోగి నిదుర మేల్కొనును. అట్లు హస్తసంచాలనముఁజేసినను మేల్కొననియెడల రోగియొక్క ముఖమునందు మెల్లఁగా నూదవలయును. అప్పుడు రోగి నిదుర మేల్కొనును. అట్లు రోగి నిదుర మేల్కొనునంతవఱకు జాగ్రతగానుండి, నిదుర మేల్కొనిన పిమ్మట రోగిని వదలి వెళ్లవలసినదేగాని యంతకు ముందు వానిని విడచి వెళ్లుటగూడదు.

## నిద్రయందుంచుటకు మార్గములు.

నీవెవనినైన నొకని నిద్రావస్తయందుంచవలెనని యుద్దేశపడినట్లయిన వానికి సులభముగాఁ గూర్చుండుటకు వీలుగానుండు కుర్చీమీఁదఁగూర్చుండఁబెట్టి, వాని కనుబొమ్మల మధ్యభాగమున నీయొక్క దృష్టిని నిలిపి, వానిని నీకండ్లయందే దృష్టిని నిలుపమని యాజ్ఞాపించవలెను. తదనంతరము నీయొక్క రెండు చేతులనెత్తికొంచెము కాలము వానియొక్క నెత్తియందుంచి తదనంతరము మెల్లఁగా నీ రెండు చేతులను నడుమువఱకు రానీయవలయును. అట్లు దెచ్చిన చేతుల నచ్చటఁగొన్ని నిమిషములుంచి తదనంతరము కాళ్లవఱకుఁబోనియ్యవలయును. అట్లు కొన్ని నిమిషములవఱకుఁ జేయ, వానికి నిద్రావస్థవచ్చును. ఎల్లప్పుడును హస్తసంచాలనముఁ జేయు

నపుడు, నీమనస్సును వానియందు నిలిపి యేక దృష్టిని ''నీవు నిదురఁబోయెదవుగాక'' యనితలంచుచు హస్తసంచాలనమును జేయవలయును. నీయొక్క శక్తివలన నిద్రావస్థకువచ్చిన మనుజునిఁ, మరల నిదుర మేల్కొల్పుటకు గాళ్లు మొదలు తలవఱకు 'నీవు నిదురమేల్కొనెదవుగాక' యని మెల్లఁగాఁ జెప్పుచు హస్తసంచాలనముఁ జేయవలయును. అట్లు చేసిన వాఁడు రెండు నిమిషములులోనే నిదురమేల్కొనును.

### నిద్రావస్థయందుంచుటకు రెండవ విధము.

నీవెవని నిద్రయందుంచఁదలఁచితివో వాని నొకకుర్చీ మీఁదఁగూర్చుండఁబెట్టి వానియొక్క రెండుకాళ్లను నీ రెండు కాళ్లమధ్యకువచ్చునట్లు చేయవలయును. అట్లు చేసిన యనంతరము వానియొక్క యెడమచేతి బొటనవ్రేలిని నీ యొక్క యెడమచేతి బొటనవ్రేలితోఁ బట్టుకొని, నీ కుడిచేతి యొక్క బొటనవ్రేలిని వానియొక్క నొసటనుంచి నీ మనస్సు నీయెదురఁ గూర్చుండియున్న మనుజుఁడునిద్రించునుఁగాక యని యేక ధ్యానపరుఁడవై దలఁచవలయును. పైఁజెప్పినప్రకారము నీవు కొన్నినిమిషములు చేసినపిదప, వానియొక్క ముఖము మీఁద హస్తసంచాలనముఁ జేయుము. ఇట్లు నీవు కొన్ని నిమిషములు చేసినతోడనే వాఁడు నిద్రించును. అట్లు నిద్రఁజెందిన మనుజునికి నిద్రనుబోఁగొట్టవలెనన్నఁ బైఁజెప్పిన హస్తసంచాలనమును గాళ్లుమొదలు తలవఱకుఁజేసి నిద్రను బోఁగొట్టవలయును ఎల్లప్పుడు నట్లు నిదురయందేమనుజు నయినను నుంచినపుడు, వానిని నిదురమేల్కొనఁజేయుట



కొంచెము కష్టతరము గావున మిక్కిలి జాగ్రతగా నట్టి సమయంబుననుండవలయును. కొందఱుజనులు నిదురనుద్వారగా గలిగించుటకు శక్తిగలిగియుందురు. కావున వారలన్నిఁటి సామర్థ్యముగలవారని యెంచక వారిని మరల నిదురమేల్కొనఁ జేయుటకుఁ దగుమైన శ్రద్ధగలవారై జాగ్రతగానుండవలెను.

### మంత్రించిన తీర్థము. MANGNETISED WATER.

మన యిండియాదేశంబునఁ దీర్థముచు మంత్రించి దయ్యములు పట్టినవారికిని మఱియు నితర రోగములవలన బాధపడువారలకును నిచ్చు వాడుక గలదు. ఇట్లిచ్చుటవలన గుణమెంతమాత్రమును గలుగనేరదనివెక్కండ్రయభిప్రాయము అట్లైన్నఁటికిని దలచవలదు. మంత్రించిన తీర్థమువలనఁ బ్రతి రోగమును బాగుగాఁగలదు. నీళ్లను మంత్రించవలెనన్న నొక లోటానిండుగ నీళ్లనుగైకొని దానిని నెడమచేతియందుంచు కొని నీయొక్క చేతివ్రేళ్లను నీళ్లయందుంచి నీ మనస్సును నీళ్లయందునిలిపి నీవేరోగమునకు నీయఁదలచిచితివో యారోగ 'మీ తీర్థమును త్రాగినమాత్రంబున బాగగును గాక' యని యుద్దేశముగలవాఁడవై నీళ్లను మంత్రించవలయును. మఱియు నీళ్లను మంత్రించునపుడు నీయొక్క వ్రేళ్లతో నీళ్లమీఁద హస్తసంచాలనము జేయవలయును. అట్లు కొన్ని నిమిషముల వఱకుఁ జేయవలయును. ఎల్లప్పుడును నివు నీళ్లను మంత్రించు నపుడు నీయొక్క మనస్సును నిలిపి మంత్రించవలయును. అట్లు నీవు మనస్సునునిలుపక మంత్రించిననీళ్లయందు నీ దేహామందుండు మంచిశక్తి ప్రవేశించదు. కావున నటువంటి తీర్థమేమాత్రము

గుణమునీయనేరదు. మంత్రించిన నీళ్లను అన్నిరోగములకు నుపయోగించవచ్చును. మఱియునొకదినము మంత్రించిన నీళ్లను వారము దినములవఱకు నుపయోగించవచ్చును. తరువాత నంత గుణము నీయనేరదు. కావున నెల్లప్పుడును నేదినము తీర్థమును నాదినమే యుపయోగించుచువచ్చిన మిక్కిలి గుణమునిచ్చును. మఱియు నీళ్లను మంత్రించుటకు రెండవ విధమెద్దియన, నీ చేతియందుండు నీళ్లపై భాగమున మెల్లగా మనస్సును నిలిపి నీవేరోగమునకీ తీర్థము నుపయోగించఁదలఁచితివో యా జాడ్య 'మీ తీర్థము త్రాగినందువలన బాగగును గాక' యనిమనస్సున నేక ధ్యాన్నపరుఁడవై యుండవలయును. అప్పుడు నీ శరీరమందలి మంచిశక్తి యా నీళ్లయందుఁ బ్రవేశించి రోగులకునధిక గుణము నిచ్చును.

శరీరమందుండు వెంట్రుకలను బెంచుటకుఁ గారణము.

ఈ విద్యను వాడుకసేయ నిచ్ఛగలవారు తమ వెంట్రుకల నెంతమాత్రము గొఱిగించఁగూడదు. మన పూర్వపు యోగీశ్వరులు వెంట్రుకలను, జేతులయొక్కయుఁ గాళ్లయొక్క గోళ్లను నెంతమాత్రమును దీసివేయక వాటినిఁ బెంచుచు వచ్చిరి. ఇందులకుఁ గారణంబేమన నెల్లప్పుడును మాగ్నెటిజమనునది సన్నని కొనలుగల వస్తువులయందుండి విశేషముగా వచ్చునుగావున మన యోగులు గోళ్లను వెండ్రుకలు, మన శరీరమందుండు తక్కిన యవయవములకంటె నవి సన్నని కొనలను గలిగియున్నందున వానిని ముఖ్యముగా నెంచి వాటినిఁ దీసివేయక పెంచుచు వచ్చిరి. కావున నీవిద్యను వాడుకసేయు



ప్రతివారును గోళ్లను వెంట్రుకలను బెంచవలయును. ఎల్లప్పుడునునట్లు పైఁజెప్పిన వానిం బెంచిన పిదప జుట్టును ముడివేసి యుంచవలెను. మఱియు గడ్డములనుగూడా ముడివేసి యుంచవలయును. గోళ్లను బెంచినపిదప హస్తములను దెఱచి యుంచక మూసియుంచ వలయును. అట్లు హస్తములను మూయుటకుఁగాని జుట్టును ముడివేసి యుంచుటకుఁగాని కారణంబేమన నీవు పైఁజెప్పినవానిని అనఁగా హస్తములను దెఱచి యుంచిన నీయొక్క గోళ్లు సన్నని కొనలు గలిగియుండుటంబట్టి నీదేహమందుండుశక్తి వెలుపలకుఁ బోవుచుండును. ఈ విధముననే జుట్టును వీడఁదీసియుండినఁ బైఁజెప్పిన నష్టమే గలుగును. ఎల్లప్పుడును నీవిద్యను వాడుకసేయు మనుజుఁడు తనయొక్క యవయవములకుఁ బని విస్తారమీయ గూడదు. మఱియు మనపూర్వీకులు దోవతిని గట్టునపుడు చెంగులను వదలక కుచ్చెలుపెట్టి దోవతినిఁ గట్టుమని జెప్పిరి. అట్లు చెప్పుటకుఁ గారణమూహించ, దోవతిలో చెంగులే సన్నని కొనలుగలిగినవి గావున నట్లు చెంగులను విడిపించుటవలనఁ దన శరీరమందుండు మంచి శక్తి యాధోవతియొక్క చెంగుల కొనల మూలము గాఁబోవునని తలఁచి యట్లు చెంగులను విడువవలదని చెప్పిరే గాని, నాబుద్ధికిఁజూడ మఱియే యితర కారణమును నాకుఁ గాన్పించలేదు. పైజెప్పిన ప్రకారము గోళ్లను బెంచినయెడల నీవేజాడ్యమునయినను బాగుసేయఁ దలఁచినప్పుడు నీ శరీరమందుండు శక్తి హస్తసంచాలనముఁ జేసి రోగి దేహమందు నీ శరీరమందుండు మంచి శక్తినిఁ త్వరగాను విస్తారముగాను ప్రవేశింపఁజేసి బాగుసేయఁ గలుగుదువు. మఱియు సన్నని

కొనలు గల వస్తువులయందుండి మాగ్నెటిజం అను శక్తి విస్తారముగా వచ్చునుగావున, మనవారలు తేలు గుట్టినను, లేక పాముగఱచినను, వేపాకుతో మంత్రించెదరు. ఏలనన; వేపాకునందు మంచి శక్తి గలదు, మఱియు నాయాకులకు సన్నని కొనలుండుటంబట్టి ఆ యాకులతో మంత్రించుట వలనఁ ద్వరితముగా భాగగుననిదలఁచి యట్లు మన పూర్వీకులా యాకును నుపయోగింపఁ జెప్పిరి. ఈ కారణముఁబట్టియే, పల మాదైనను, ఉపిరి, అపిరైనను, చన్ను కుదురైనను, పంగల మాదైనను, నిటువంటి 360 మాదలకు గఱికె దీసుకొని మన యిండియా దేశమునందు నిప్పటికిని మంత్రించుచున్నారు. ఈకారణము లన్నిఁటినిఁబట్టి మన పూర్వీకులిటువంటి గొప్ప సమాచారముల నన్నిఁటినిఁ గనుఁగొని యెంత సులభమయిన మార్గములుగా మనకుఁ జూపిరో యాలోచించుఁడు. ఇప్పుడు మనలనటువంటి సంగతులను గనుఁగొనుఁడనన మనకు సాధ్యమవునా? కాదు. గనుక మనపూర్వులను నిందించక యిప్పటికైనను తెలివిగలవారలై మన పూర్వీకులు చెప్పిన ప్రతి విషయమును మంచిదిగానెంచి వాటిని నవలంబించెదరని నేను నమ్ముచున్నాడను.

## సమ్మోహనము.

1. నేనిప్పుడు సమ్మోహనము గుఱించి కొంత చెప్పంబూనితింగాన శ్రద్ధగాఁజదివి దానియందలి సంగతులను గ్రహించి, మెలఁకువ గలవారై నటించవలయును. సమ్మోహనమనఁగా (Hipnotism) దీనిని నేర్చుకొన వలెనన్నఁ బై భాగములయందుఁ జెప్పిన పద్ధతులనే వాడుక సేయవలసి



యున్నది. దీనికి హా సనంచాలనముఁ జేయుటయు, నేకదృష్టినిఁ జూచుటయు, బుద్ధిని నితరములయిన వానియందు నిలుపక, నీవు తలఁచిన దానియందే మనస్సును నిలుపుటయు ముఖ్యములు కావున నట్లు వీని వాడుక చేసిన మనుజుఁ డెవనియందు సమ్మోహనము నుపయోగించఁ దలఁచెనో వానిని నీముందు భాగమున నిలువుమని చెప్పి, వానినిఁ దన మనస్సున నెద్దియుఁ దలఁచవలదనియును, నిశ్చింతగలిగి యుండవలసినదనియు నాజ్ఞాపించవలయును. అట్లు చేసిన పిమ్మట నీయొక్క రెండు చేతులను వానియొక్క వీపుననానించి, నీ వీక్రింది విధమునఁ జెప్పఁవలయును. "నీ విప్పుడు నేను నా రెండు చేతులను దీసిన తక్షణమే నావయిపున బడెదవుగాక" యని మనస్సును నిలిపి మెల్లఁగా మృధుమధుర వాక్యములతోఁ జెప్పవలయును. అట్లు చెప్పునపుడు నీయొక్క దృష్టిని వానియొక్క-ముచ్చిలి గుంటయందు నిలిపి, "నీవు నావైపునకుఁ బడెదవుగాక" యని తదేక ధ్యానపరుఁడవై చెప్పవలెను. అట్లు దలఁచి చెప్పిన కొన్ని నిమిషములలోనే వాడు నీకుఁ లోఁబడినవాఁడై నీ చేతులను దీసిన తక్షణమే, నీ వయిపునకుఁ బడును. అట్లు వాడు పడునపుడు, నీవు మిక్కిలి జాగ్రతగలవాఁడవై వానినిఁ గ్రిందఁబడనీయక నీయొక్క రెండు చేతుల నడ్డముంచి పట్టుకొన వలయును. నీవు వాడుపడునపుడశ్రద్ధ గల వాఁడవై పట్టుకొననియెడల, వాడట్టి సమయంబున నీకు లోఁబడియున్నవాఁడు గావున వానికి మిక్కిలి యపాయకరముగు హాని గలుగును, మఱియుఁ గొన్ని సమయములయందు వానికి స్మారకముదప్పుట గూడఁ గలుగును. గావున నట్టి సమ

యములయందుఁదగు జాగ్రతగా నుండవలయును. ఇదియును, నింకను గ్రిందఁ జెప్పఁబోవునవియు వేడుకలు సేయుటకుమిక్కిలి యుపయుక్తములుగా నుండును.

## 2. చేతులనంటుకొనునట్లు జేయుట.

నీ వెవనినైనను బిలిచి వానియొక్క రెండు చేతులను, నొకచేతితో మఱియొక చేతిని గట్టిగాఁ బట్టుకొనునట్లు చేసి యట్లు చేసినపిమ్మట నీవీక్రింది విధమునఁ జెప్పవలయును. "నీవు చేతులను రెంటిని విడదీయుటకు నీకు శక్తి లేదు. అవి గట్టిగాఁ గఱచుకపోయినవి. నీవెంత ప్రయత్నించినను నీకు విడఁదీయుటకు సాధ్యము గాదు. నేను నీకు నీ రెండు చేతులను విడదీయుట కుత్తరువిచ్చిన తక్షణమే యవి యూడిపోవును. అంతవఱకు నీకు విడఁదీయుటకు సాధ్యము గాదు. కావున నీవు పరీక్షఁ జేయవలెనన్నఁ బ్రయత్నించి చూడు" మని మెల్లఁగా మృధు మధుర వాక్యములతోఁ జెప్పుచుండవలయును. వాఁడు వానియొక్క చేతులను విడఁదీయుటకుఁ బ్రయత్నించినప్పటికిని వానికి సాధ్యముగాక నీవు విడఁదీయుట కుత్తరువిచ్చిన తక్షణమే యవి యూడిపోవును. ఎల్లప్పుడును నీవు పై ప్రకారము సేయునపుడు నీ మనస్సును నిలిపి, నీవు చేయుదానియందే ధ్యానము గలవాఁడవై, నీయొక్క దృష్టిని వానియందే నిలిపి సేయుచుండవలయును.



## 3. చేతినివంచకుండునట్లు సేయుట.

నీవెవనినైనను బిలిచి వానియొక్క చేతినిఁ జాడమని చెప్పవలయును. వాఁడట్లు చేసినతదనంతరము నీవీక్రింది విధమునఁ జెప్పవలయును. "నీవు నేనొకటి, రెండు, మూడని చెప్పునంతలో నీయొక్క చేతినివంచఁజాలవు. అది ఱాయివలె బిఱ్ఱ బిగుసుకొనును. నీవు నీ చేతిని వంచుటకు నెంతప్రయత్నించినను, నదివంగక గట్టిగాఁగఱ్ఱవలె బిగుసుకొని యుండును నీకు నీ చేతిని వంచుటకు నిష్టమున్నయెడలఁ బ్రయత్నించిచూడుము. నీ వెంతప్రయత్నించిన నదివంగనేరదు" అనిమెల్లఁగా నీమనస్సును వానియందు నిలిపి, "యొకటి, రెండు, మూ" డని చెప్పవలయును. అట్లు నీవు చెప్పినయెడల వాఁడు చేతిని వంచుటకు నెంతప్రయత్నించినను వంచఁజాలఁడు, కనుక వాఁడట్టి స్థితియందుండునపుడు, నీవు, వానియొక్క చేతిని వంచునట్లు చేసెదనని సభవారలకుఁ జెప్పి 'నీవిప్పుడు నీ చేతిని వంచఁగలుగుదు' వని వానికి నాజ్ఞాపించవలయును. అట్లు నీ వాజ్ఞాపించినతక్షణమే వానికిఁ దన చేతిని వంచుటకు శక్తిగలుగును.

## 4. గచ్చునేలను జెఱువుగాఁ జూపి యీఁదునట్లు చేయుట.

నేను పైఁజెప్పిన విధముగాఁ జేసి మనుష్యులను గ్రుడ్డివారిఁగను, లేక కుంటివారిఁగను జేసి యాడించవచ్చును. మఱియుఁ గొందఱ జనుల నాకర్షణఁ జేసి వారికి వట్టినేలయందొక చెఱువును జూపుట యేలాగన, నీవెవనికట్లు చూపఁదలఁచితివో

వానిని నీయొక్కశక్తివలన మోహాకునిఁగాఁజేసి యీ క్రింది విధమునఁ జెప్పవలయును. "నీ విప్పుడు స్నానముఁ జేయుటకుఁ జాలా యిచ్ఛగలవాఁడవుగాఁ గానంబడుచున్నాఁడవు. కాన నీ ముందునుండు మంచి నీళ్లకొలఁకునందు స్నానముఁజేయు" మని చెప్పవలయును, నీవట్లు చెప్పిన తత్క్షణమే మోహాకుఁడు తనయొక్కగుడ్డలను దీసి స్నానముఁజేయుటకు మొదలుపెట్టును. అట్టి సమయమున నది కొలనుగాక ఱాతిభూమియగుటవలన వాని చేతులకు నెత్తురువచ్చుచున్నను స్నానముఁజేయుట యాపక మిక్కిలి సంతోష మనస్కుఁడై స్నానముఁజేయుచుండును. అట్టి సమయంబున నీవు వానికిఁగొలకునుండి లేచుటకుత్తరువు నిచ్చినంతమాత్రంబుననే వాఁడుకొలనియందుండి లేచును. తదనంతరము వాని శరీరము తుడుచుకొనుటకుగాను నొకతుండుగుడ్డనిచ్చి తుడుచుకొనుమనినఁ దుడుచుకొనును. పిమ్మట వానితో నిచ్చట మంచి మామిడిపండ్లతోఁటగలదు. అందుదివ్యమైన పండ్లుగలవు. నాకుఁజూడ నీవు వాటినిఁదినుటకుఁజాలా యిచ్ఛగలవాఁడవుగాఁ గానంబడుచున్నాఁడవు. గాన నీవాతోఁటకుంబోయి నీవు కోరినపండ్లను గోసుకొనుమని చెప్పినంతమాత్రంబుననే, వాఁడు పండ్లను గోయుచున్నట్లుగా నభినయించుచు ఒండ్లను గోయుచుండును. అట్లు కోయుచున్న మనుజునిఁజూచి, చూడవచ్చినవారందఱు నవ్వుచుందురు గదా? దానివలన మనమట్లాడువానియొక్క పరువును దీసివేయుచున్నారము గావున నీ విద్యను నేర్చుకొనినవారెల్లరు నేను బైనఁజెప్పియుండు వేడుకలను జేయుటయందుపయోగించక, మంచి స్వభావముగలవారలై మన యిండియా



దేశంబున రోగములవలనఁ బీడింపఁబడుచున్న రోగులయందు వారియొక్క విద్యనుపయోగించి, వారియొక్క రోగములను బాఱఁదోలి వారలను సంతోషమనస్కులనుగాఁ జేసి వీరును, సంతోషముగలవారై మన యిండియా దేశమునకు ఖ్యాతినిఁ దెచ్చెదరుగాక యని నేను భగవంతునికి నమస్కరించుచున్నాఁడను.

## జంతువులను లోబరుచుకొనుటకు మార్గములు.

జంతువుల నాకర్షణ విద్యవలన మిక్కిలి సులభముగా లోఁబఱచుకొనవచ్చును. అదియునుంగాక యూరియందుఁ దిరుగు జంతువులను, నరణ్యములయందుఁ దిరుగుజంతువులకంటె మిక్కిలి సులభముగా నాకర్షింపవచ్చును. పూర్వము మన యిండియా దేశంబునఁ బెద్దపులులను గట్టుగట్టుదురను మాటను మనము పలుమాఱు వినియున్నారము గదా? దానింజేయుటకుఁగాను వారీవిద్య నుపయోగించి చేయుచుండిరేగాని, మఱి యేవిధముగాఁగాని వారు చేయుచుండుటలేదు. మఱియుఁబెద్దపులులనుగాని పాములనుగాని గట్టుగట్టుటకు ననేకములగు మంత్రములున్నప్పటికిని మనవారలకు మనస్సిద్ధి లేనియెడల సిద్ధింపనేరవు. మనస్సిద్ధిని సంపాదించుటకు నేను పైభాగములయందుఁ జెప్పియుండు పద్ధతుల ననుసరించి చేయవలయునుగాన, నాకర్షణవిద్యచేఁదప్ప మఱి యేవిధమయిన విద్యచే మనపూర్వీకులు సేయుచుండుటలేదని నేను జెప్పుటకుఁ గారణంబయ్యె. నేను నాయొక్క యనుభవములో ననేకములయిన పాములను ననేకజంతువులను లోఁబఱచుకొనియుంటిని.

అనఁగాఁ కట్టుగట్టియుంటిని. నేనట్లు చేసినదానిలో నొక విషయము నీక్రింద నుదహరించఁ దలఁచితిని నే నొకనాటి సాయంకాల సమయంబున వంగప్రోలను పురమునందుండు కొండపైకిఁ బోతిని. అప్పుడొక పెద్ద నాగసర్ప మొక రాతి క్రిందనుండి బుసలుగొట్టుచుఁ బోవుచుండె. అట్టిసమయంబున నేను గుఱ్ఱతనముచే నూరికయుండక గొంత యిసుకను జేతికిఁదీసుకొని దానిని మంత్రించి దానిపైన వైచితిని. అంతట నా పామచ్చోటనే నిలువంబడి యటునిటుఁ గదలనేరక బుసలు గొట్టుచు నాడుచుండె. అట్టిసమయంబునఁ దిరుగ నాయొక్క శక్తిని దానిమీఁద నుపయోగించితిని. అంతట నా పామాడుటకు బదులుగాఁ గదలక మెదలక చచ్చినదానివలెఁ బడియుండుటను జూచి, జాలిగొన్నవాఁడనై, తిరుగ నా పామెప్పటి స్థితికివచ్చుటకై నాయొక్క శక్తి నుపయోగించితిని, అంతటఁ బాము నన్నుఁ గఱవవచ్చుటకుబదులుగా నొక వైపునకుఁ బాఱిపోవుచుండె. అట్టిసమయంబున నాతోనుండు నా మిత్రుఁడు నేను దానినిఁజంపకున్న నది నన్ను బుసపెట్టి చంపునని చెప్పెనుగాని యైతే నేను వానిమాటలను బాటించనైతిని. తఱువాతఁ జాలాదినములా వైపునకే వెళ్లుచుంటిని గాని యొక్కదినమైననుదిరుగ నేనా పామును జూచుటకుఁ దటస్థించదయ్యె. పై విధమున నే ననేకములైన పాములను గట్టుగట్టి వాటినిబట్టుకొని యాడించుచుండువాడను. ఈ విద్యను నేర్చిన ప్రతివారినిఁ బై విధమునఁ జేయుట కడు సులభము. మఱియు నీ యాకర్షణశక్తి కొన్నిజంతువుల యందు స్వాభావికముగాఁ జాలావిస్తారముగాఁ గలదని నేను



గొన్ని గ్రంథములయందుఁ జదివియున్నాఁడను. దానికిఁగానీ క్రిందఁగొన్ని యుదాహరణముల నిచ్చెదను మన యిండియా దేశంబునఁ బూర్వమొకానొకప్పుడు, తల్లి, కూతురు పగటి కాలంబున నొక తోఁటకుఁ బోఁగా, నచ్చట నొక చెట్టువద్ద నొక పెద్దకొండ చిలువయున్నట్లును, నట్లున్న కొండ చిలువను బిడ్డ చూడక కొంచెము దాపునకుఁబోయినట్లును, నట్లుదాపునకుఁ బోయిన చిన్నదిపామునుజూచి యఱచుటకుశక్తిగలిగియున్నను, నచ్చటనుండి దూరమునకుఁ బరుగెత్తుటకు బదులుగాఁ బాము దగ్గఱకు మెల్లఁగానడచిపోయి యాపామునకు నాహారంబయ్యె నేను బైఁజెప్పిన విధమున ననేకములగు వింత లాఫ్రికాదేశంబున ననేకములిప్పటికిని జరుగుచున్నవి. అనేకములయిన పాములు, పక్షులు, నాకర్షించుటను ననేకజనులు జూచియుండ వచ్చును. సుల్లీవాన్, రారీ అనువారు స్వాభావికముగా వారి శరీరములయందు గుఱ్ఱములను లోఁబఱచుకొనుటకుఁ గావలసిన యాకర్షణవిస్తారముగాఁ గలిగియుండిరి. వీరు వారిదేశంబున గుఱ్ఱములను లోఁబఱచుకొనుటయందుఁ జాలా ప్రసిద్ధులు. ఎవరయినను గుఱ్ఱమును లోఁబఱచుకొనవలయునన్న, మిక్కిలి ధైర్యము నవలంబించి, నేరుగా గుఱ్ఱపు లాయమునకు వెళ్లి, యే గుఱ్ఱమును లోఁబఱచుకొనఁ దలఁచితివో యా గుఱ్ఱము యొక్క ముందఱిజూలునుగాని లేక చెవినిఁగాని పట్టుకొని రెండవచేతితోఁ దలమొదలు ముక్కువఱకు నైదాఱు నిమిషములవఱకు హస్తసంచాలనము సేయవలయును. అట్లుచేసిన తదనంతరము నీయొక్క కుడిచేతితో దానిమెడమీఁద దట్టవలయును. అట్లు దట్టి దాని ముక్కునొక చేతివ్రేళ్లతో

గొద్దిగా నొక్కిపట్టి తలమొదలు వీపువఱకును హస్తసంచాల
నముఁ జేయవలయును. పైఁజెప్పిన విధమునఁ బదినిమిషముల
వఱకుఁ జేయవలయును అట్లు చేసిన తక్షణమే గుఱ్ఱము
నీకులోఁబడును. అట్లుగాక మొదటిదినము నీకుఁ గుఱ్ఱమం
తగా లోఁబడకపోయినను, నట్లు ప్రతిదినమును జేయుటవలన
నాపై యాదివారము దినములలోనే నీకులోఁబడును. అది
నీకులోఁబడినట్లు దెలిసికొనుట యెట్లన, నీవు రెండు ముక్కు
రంధ్రములను బట్టుకొని హస్తసంచాలనముఁ జేయునపుడు
గుఱ్ఱము తలనువంచి సకిలింపక మిక్కిలి మైకముగలిగిన దాని
వలెఁ గండ్లను దెఱువజాలక యుండును. అట్టి సమయంబున
నీవు మనుష్యునితో మాటలాడురీతిగా గుఱ్ఱముతో నీయిష్టము
వచ్చినరీతిగా మాట్లాడవలయును. అప్పుడు నీవు దానిని
నీతోడ రమ్మనిన నీవెనుకనే వచ్చుచుండును. నీవు దానిని
నిలువఁబడమన్న నది యచ్చోటనే నిలువఁబడి యటునిటుఁగద
లక మెదలక నిలువఁబడియుండును. అట్టి సమయమున నీవు
దానియొక్క మత్తును బోఁగొట్టుటకుఁగాను దోఁక మొదలు
మూఁతివఱకు హస్తసంచాలనముఁ జేయవలయును, అప్పుడు
గుఱ్ఱముయొక్క మత్తువదలును. మఱియు దానిని నిదుర మేల్కొ
నఁజేయవలెనన్న నొక చేతిగుడ్డనుదీసుకొని గుఱ్ఱముయొక్క
ముఖముమీఁద నిదుర మేల్కొనెదవుగాక, యని యుద్దేశము
గలవాఁడవై యా గుడ్డతో విసరవలయును. ప్రతి జంతు
వును, జేతిగుడ్డను ముఖమునందు విసరి నిదుర మేల్కొనఁ
జేయుట యుత్తమమని నేను నమ్ముచున్నాను. మఱియుఁ
గుక్కలు, పిల్లులు, కుందేళ్లు మొదలగు జంతువులను మిక్కిలి



సులభముగా లోఁబఱచుకొనవచ్చును. వాటిని లోఁబఱచు
కొనవలెనన్న నీవీక్రిందివిధమునఁ జేయవలయును. మొదలు
జంతువు నొక చేతితోఁబట్టుకొని, రెండవ చేతితో దానిని
మెల్లఁగా దువ్వుచు, మెల్లఁగా వీపునఁ దట్టుచుండవలయును.
అప్పుడా జంతువు సంతోషముతో నానందించుచుండును. అట్టి
సమయమునఁ దలమొదలు మూఁతివఱకు హస్తసంచాలనముఁ
జేయవలయును. అంతట దానికి నిద్రావస్థగలుగును. దానికి
నిద్రావస్థగలిగినదో లేదోయని దెలుసుకొనుట యెట్లన, నది
కండ్లనుమూసి, దేహమును జలదరించునట్లుగాఁ జేసిన, దానికి
నిద్రావస్థవచ్చినదని యెఱుఁగునది. ఎల్లప్పుడు జంతువులకు
నిద్రావస్థఁదెప్పించునపుడు నీయొక్క చేతులతో వాటియొక్క
కండ్లను మూయుటవలనజాలా చెఱుపుఁజేయును, గాన నట్లెన్నఁ
డును జేయకుము. ఆ జంతువు నిద్రావస్థకు వచ్చినపుడు నీవు
మిక్కిలి కాంతిగలదీపమును దాని కండ్లముందఱఁబెట్టినను నది
యీ కాంతినిఁజూచుట తటస్థించదు. అట్టిసమయమున జంతు
వును నీ వద్దకురమ్మని పిలచిన నీ వద్దకువచ్చును. నీవు దానిని
నిద్రావస్థనుండి మంచి స్థితికిఁదీసుకరావలెనన్నఁబైఁజెప్పినప్రకా
రము చేతిగుడ్డను దానిముఖముమీఁదవిసరి దానిని నిదుర
మేల్కొనఁ జేయవలయును. పావురములు, కోళ్లు మొదలగునవి
మిక్కిలి సులభముగా లోఁబడును. వీనిని లోఁబఱచుకొనవలె
నన్నఁ జేయునదెద్దియనఁగాఁ బందెమాడు పుంజును దెచ్చియొక
బల్లమీఁద నిలువఁబెట్టి దాని తలమొదలు ముక్కువఱకు
హస్తసంచాలనముఁ జేయవలయును. తదనంతరము దాని
రెండుకాళ్లను ద్రాటితోఁగట్టి, నీవు సున్నపుచుక్కను గైకొని

దాని మెడమొదలు వీపువఱకు నొక గీఱనుగీసి, యా గీఱను గొంచెము నేలమీఁద నాలుగయిదడుగులవఱకు గీయవలయును. అట్లు గీచినతదనంతరము తిరుగ దానియందు హస్తసంచాలనమును జేయవలయును. అంతట నీవు దాని కాళ్లకుఁ గట్టిన త్రాటిని విప్పివేయవలయును. పిమ్మట నీవాపుంజు నెచ్చటనుంచిన నచ్చటనే గదలమెదలక యుండును. మఱియు దానితలను దాని రెక్కలక్రిందవుంచినయడల అట్లుంచిన తలను దీసివేయక యచ్చటనే యుంచుకొనియుండును. దానికి మఱల స్మారకముగా వచ్చుటకుఁగాను జేతిగుడ్డను తీసుకొని దాని ముఖమునందు విసరుచు శబ్దమును జెయ్యవలసినది. అంతట నది నిదురమేల్కొనును. ఈ యాకర్షణశక్తి కొందఱి జనులకు స్వాభావికముగాఁగలదు. అందువలనఁ గొందఱు పాములవాండ్రు పెద్ద నాగసర్పములను సైతను లోఁబఱచుకొనుటను మనము పలుమాఱులు చూచుచున్నాము. మనము దానినిఁ జూచి వాఁడుమంత్రించి పామును నిలిపినాఁడనియు, గట్టుగట్టినాఁడనియుఁ జెప్పెదము. సాధారణముగా నీ యాకర్షణశక్తి పరంపరగావచ్చుటగలదు. ఒకఁడు గొప్ప మంత్రవేత్తగానుండవచ్చును, వానికొమారుఁడా మంత్రములను వాడుకచేసిన యితర మనుజునికంటెఁద్వరితముగా నేర్చుకొని వృద్ధికిరాఁగలడు. కావున నీయాకర్షణ శక్తినిజంతువుల యందుపయోగించు విధముజెప్పితిని. ఇప్పుడు మనస్సులోనుండుసంగతులను జెప్పుటను జెప్పఁబూనితిఁగాన శ్రద్ధతో గమనించవలయును.



## మనస్సునందుండు సంగతులను గనుఁగొనుట.

## MIND READING.

ఇతరుల మనస్సులయందుండు సంగతులను గనుఁగొనుటను (Mind Reading) అని చెప్పెదరు దీనిని వాడుకఁజేయుటకు సులభమైన మార్గము లెవ్వియైనదియుఁ జెప్పెదను. దీనిని నీవు వాడుక సేయవలెనన్న, మనస్సు ప్రధానంబుగావున నీశరీరమునఁ గలుగు గుణములను గుఱించియుఁ, బ్రపంచమును గుఱించియుఁదలంచక, నీమనస్సును నిశ్చలముగానుంచి,. నీ వేసంగతినిగుఱించి దలంచఁదలఁచితివో దానినే నీ మనస్సున నిలుపవలయును. అట్లు నీమనస్సును నిలిపినపుడు నీమనస్సునకు మొదటనేసమాచారము వచ్చుచున్నదో యా సమాచారమును నిజమగు సమాచారముగా నెఱుంగునది. కొన్ని సమయములందు నీవు కొన్నిఁటినిఁ దప్పుటగలదు. అట్లు నీవు తప్పుటవలన నిదిచాలాకష్టమనియు, నిది తొందఱగావచ్చునట్లు కనఁబడుటలేదనియు నూహించి, దీనిని నభ్యాసముఁజేయుట మానివేయక పట్టు దలగలవారలై యభ్యాసముఁజేయవలసినది. అట్లు కొన్నిదినములుసేయ, దానియందు వాడుకగలవాఁడవై నీ వేసంగతినైనను జెప్పుటకు శక్తిగలవాఁడవగుదువు. ఈవిద్య నీకు లభించినది లేనిది కనుఁగొనుటకై, నీయొక్క స్నేహితులను గొందఱిని నొకగదియందుఁజేర్చి వానిని నొక వస్తువును దాచుమనిచెప్పి, వానిని నీకండ్లకు గుడ్డనుకట్టుమని చెప్పుము. తదనంతరము నెవరయితె నావస్తువును దాఁచిరో వారియొక్క రెండుచేతులను నీవు కొంచెముసేపు పట్టుకొని, పిమ్మట వదలి నీవు మెల్లఁగా నీమనస్సేవైపునకు నిన్నుఁద్రిప్పునో

యీవైపునకే నీవును వెళ్లుచుండవలయును. అట్లు చేసిన నీవు వస్తువున్న చోటికిఁ బోయిచేరెదవు. నీవు వారుదాఁచినవస్తువు నొద్దకు వెళ్లఁగానే నీయొక్కనడుమును నీవు వంచుటకుగాను, నీకు నిష్టముగలుగును. అంతట నీవు వంగి నీచేతులను క్రిందికి రానిచ్చిన, నావస్తువే సనుముగా నీచేతులకుఁ గానంబడు. అంతట నీకండ్లకుఁగట్టియున్న గుడ్డనువిప్పి యీవస్తువును నీ స్నేహితులకుఁ జూపవచ్చును. అది తప్పక సరియైయుండును. మఱియు నీయొక్కస్నేహితుని కొన్నియంకెలను దలఁచమని చెప్పి, వాఁడుదలఁచిన సంఖ్యలను మొదలు దప్పినను దినముల మీఁదనొకటియుఁ దప్పక చెప్పఁగలవాఁడవగుదువు. దీనినే మనపూర్వీకులు విస్తారముగా వాడుకచేసి ముందుజరిగిన సమాచారములను, జరుగుచున్న సమాచారములను చెప్పఁగలిగిరి. ఇప్పుడన్ననో మనపూర్వీకులు చెప్పువిధమునఁ జెప్పువారలొకరును గాన్పించరు. కావున దీనింజదివినవారలందఱును శ్రద్ధను వహించి వాడుక చేసినయెడల మనపూర్వీకులు చెప్పుచుండిన విధముగాఁ జెప్పుటకు శక్తిగలవారలగుదురు. నేను మీఁదఁ జెప్పిన విధము సులభముగాఁ గానంబడినను, వాడుకకుఁ దెచ్చుటకు కష్టతరమైనను, మిక్కిలి యోర్పునువహించి, యొంటరిగాఁ గూర్చుండి, మనస్సును దనకు స్వాధీనముఁ జేసుకొనవలయును. మఱియు దీనిని వాడుక సేయుమనుజుఁడు చింతలనుమాని, సంతోషముగలవాఁడై చేసినయెడల వానికిఁ ద్వరితముగావచ్చును. అట్లుకొద్దికొద్దిగాఁ జిన్నచిన్నవాటినిఁ జెప్పుటకు శక్తిగలిగినయెడల నెంతగొప్ప సమాచారములైనను



సులభముగాఁ జెప్పుటకు శక్తిని గొద్దిదినములలోనే సంపాదించఁగలరని నేను మనస్ఫూర్తిగా నమ్ముచున్నాఁడను.

ఉః—కొన్ని సమయములయందు నీయొక్క స్నేహితునికిఁగాని లేక దగ్గఱబంధువుగా నుండువానికిఁగాని యపాయమేదేనొక యూరియందుఁ గలిగినప్పుడాసమాచారము నీకుఁ దెలియకపోయినప్పటికిని నాదినంబున నీమనస్సంతయుఁ గలవరముగా నుండుటను మీరు పలుమాఱు జూచియేయుండవచ్చును దీనినింబట్టియయినను తెలివిని వహించి, యీవిద్య వాడుక జేయని సమయములయందే, యిట్లుకనుఁగొనుట తటస్థించుచున్నపుడు దీనిని బాగుగా వాడుకచేసినయెడల నెంత వృద్ధికి వచ్చెదరో, పైఁజెప్పిన కారణమునుబట్టియయినను నూహింపవచ్చును. నాయనుభవములోనే జేసిన సమాచారములు నేనీయాకర్షణవిద్యను నాచిన్నతనమున (ననఁగా నాకు పదునాలుగు సంవత్సరముల వయస్సున) దీనిని నభ్యసించుటకు మొదలుపెట్టితిని. నాకు నాచిన్నతనము మొదలుకొని రోగములు బాగుసేయవలయునని మిక్కిలి యభిలాషగలదు. ఇట్టియభిలాషతో నీవిద్యను వాడుకసేయుటకు మొదలుపెట్టితిని.

నేను నేర్చుకొనిన మొదటి సంవత్సరంబునఁ దేలుగుట్టినవారికిఁ, బాములుగఱచినవారలకు, మఱియు నడుములయందుఁగాని కాలియందుఁగాని లేక చేతియందుఁగాని బెణుకులు గలిగినవారలకు బాగుసేయుచు నచ్చితిని రెండవ సంవత్సరంబున (నేను జిన్నవాడనయినందున) వేడుకలు సేయుటయందభిలాషగలవాఁడనై, యితరులకుఁ దెలియకుండునట్లు పరీక్షించు

చువచ్చితి. అట్లు పరీక్షించి దానిని మిగుల వృద్ధికిఁ దెచ్చిన వాఁడనై యనేక ప్రదేశములయందు వేడుకలను జేసి బంగారు పతకములను జడ్జీల వద్దనుండియు, మఱియు గొప్పవారివద్ద నుండియుఁ బొందియుంటిని. ఇట్లు నేను వేడుకలుసేయుచు వచ్చినప్పటికిని, దీనిని నేను ముఖ్యముగా నెంచుకొనక, రోగములచేఁ బీడింపఁబడుచున్నవారలకు బాగుసేయుట ముఖ్యోద్దేశముగలవాఁడనై బాగుసేయుచు వచ్చితిని. మఱియుఁ గొన్నిసమయములయందుఁ బాములను గట్టుగట్టుటయందు నిచ్చగలవాఁడనై యనేకములగు పుట్టలవద్దకువెళ్లి వాటిని ద్రవ్వి వాటినిఁగట్టుగట్టి పట్టుకొని యాడించుచుండువాఁడను, కొందఱు పెద్దలయినవారు నేనుబైప్రకారము సేయుటనుబట్టి వారలు చింతగలవారలై నాకుఁ జెప్పినదేదియన, నీవు ప్రపంచంబున రోగములచే పీడింపఁబడుచున్నవారలు వేనవేలుండఁగా వారలందఱకు మేలుసేయక నీవు కష్టపడి సంపాదించిన శక్తిని వృధాగా నిష్ప్రయోజనమయిన విషయములలో దారబోయుచున్నావని చెప్పి కోపమనస్కులైరి. అదిమొదలు బాధచేఁ బీడింపఁబడుచున్న మనుజులకు బాగుసేయుచువచ్చితిని. నేనిప్పటికి ననేకవేల రోగములను బాగుచేసియుంటిని నేను బాగుచేసిన రోగములలో నొకటిని నీక్రిందఁదెలిపెదను. కాండూరి శఠగోపాచార్యులయ్యావార్లంగారు క్రొత్తపట్టణమనుగ్రామ నివాసస్థులు వీరెనిమిది సంవత్సరములుగాఁ దలకాయినొప్పి వలనను, రెండువసంవత్సరములుగా మోకాళ్లనొప్పివలనను బాధపడుచుండిరి. వీరీయెనిమిది సంవత్సరములుగా ననేకవేల మందులనుపయోగించి



వాటివలన నివారణ గానందున, రోగము కుదురునను నాశ వదలియుండిరి. పిమ్మట వారొకదిన మీసమాచారమును నాకుఁ దెలిపిరి. ఆదినము మొదలుకొని వారిని నేను జూచుచువచ్చితిని. నేను బదియేనుదినములు వారిమీఁద నాశక్తిని నుపయోగించితిని. అప్పటినుండి యిప్పటికిని వారికిఁదలనొప్పిగాని కాళ్లనొప్పులుగాని కానంబడుటలేదు. మఱియుఁబైఁజెప్పిన నొప్పులవంటిరోగము లింతకుమునుపు వేల రోగములను బాగుచేసియుంటిని. మఱియు బాలురకుఁగాని మధ్యవయస్కులకుఁగాని రోగముబాగుసేయవలయునన్న కొద్దిదినములు పట్టును. ముసలివారికి బాగుసేయవలయునన్న ననేక దినములు పట్టును. మఱియుఁగొన్ని సమయములయందు బాగుగాకయు నుండవచ్చును. నేను బుట్టుకతోఁ జెవుడు మూగగానున్న వారికి సహితము బాగుచేసియుంటిని. మఱియు భూతములచేఁ బీడింపఁబడుచున్నవారలకు మిక్కిలి చాకచక్యముగా మూఁడు నాలుగుదినములలోనే గుణముగలుగులాగునఁ జేసియుంటిని. మఱియుఁ బాములును, బిచ్చికుక్కలును, నెలుకలును, నక్కలును గఱచి బ్రతుకఁడనిచెప్పి వైద్యులచే విడిపింపఁబడినవాటిని బాగుచేసియుంటిని, నేనేదేనొకరోగముమీఁదఁ జేసినతక్షణమే యామనుజునకుఁగల రోగముయొక్క సూచనలు నాకుఁగానంబడుటకలదు. ఏలాగన, నొకరోగి కాళ్లనొప్పులచే బాధపడుచున్నాఁడనియెఱింగి, వానికినేను మెస్మరిజమువలన బాగుసేయఁదలఁచి వానిమీఁద నాశక్తిని నుపయోగించిన రెండుమూఁడు నిమిషములకంతెయు వానియందుఁగలనొప్పి నాజేతులయందుఁ గానంబడును. అట్లునాకు నొప్పులుకానంబడినరోగికిఁ

ద్వరితముగా బాగవునని తలఁచువాఁడను. నేను దలఁచి నట్టులే రోగికిఁ ద్వరితముగా నెమ్మదిగానంబడుచు వచ్చినది. కావున నీవిద్యను వాడుకకుఁ దెచ్చి రోగములమీఁద నుపయోగించువారలకుఁ బైఁజెప్పినప్రకారము జరిగినయెడల భీతినిఁ జెందక, వారియొక్క చేతులకు వారే హస్తసంచాలముఁ జేసుకొనవలయును. అట్లు వానియొక్కచేతులకు నొప్పులుగాని యితర యేసూచనలుగాని కనపడనప్పటికిని వారిచేతులకు వారే హస్తసంచానలముఁ జేసుకొనుట మిగులనుపయోగకారి. రోగులకు బాగుసేయుటకుఁగాను జనులనేకులు హస్తసంచాలనముఁ జేయుదురు. వారికి హస్తసంచానలము దప్ప మఱియే యితర మార్గమును దెలియక యుండవచ్చును. కావున నీక్రిందఁ గొన్ని యితరమార్గములను గూడఁజెప్పెదను. నేనితరమార్గములను జెప్పుటవలన హస్తసంచాలనమువలన రోగము బాగుకాదని యూహించవద్దు. హస్తసంచాలనము ప్రతి మనుజుఁడును నుపయోగించవలయును. పై దానికిఁ దోడుగా నీక్రిందఁజెప్పువాటినిఁ గూడ జేర్చియున్నయెడల మిగుల నుపయోగికారిగానుండును. అవి (Breathing) ఊదుటదొనియును, (Taping) తట్టుటయనయు రెండు విధములు వీటిని వాడుకసేయుటకు పద్ధతులు వాడుక చేయు ప్రతిమనుజుఁడును సూర్యోదయముగాక మునుపే నిదుర మేల్కొని స్నానముఁజేసి యొకపీఠమునందుఁ గూర్చుండిగాని లేక కృష్ణాజినముమీఁదఁ గూర్చుండిగాని బాచిపెట్లు పెట్టుకొని కూర్చుండవలయును. అట్లుకూర్చుండిన మనుజుఁడు తన వక్షస్థలమును ముందుకు విఱిచి మెల్లఁగా గాలిని లోనికిఁబీల్చి



మెల్లఁగా విడుచుచుండవలయును. ఎల్లప్పుడును నట్లుగాలినిఁ బీల్చునపుడు " నేను గాలియందుండు మంచిశక్తిని లోనికిపీల్చుచున్నా " నని తలంచుచుండవలయును. విడుచునపుడు " నా శరీరమునందలి చెడ్డ శక్తిని విడుచుచున్నా " నని తలంచవలయును అట్లు కొన్నిదినములు చేసినట్లయిన నీ దేహమందుండు చెడ్డశక్తినశించి మంచిమహాత్తుగల శక్తి నీ శరీమందుఁ బ్రవేశించును. అట్లద్భుతమగు నీశక్తిని సంపాదించిన పిమ్మట రోగములమీఁద నుపయోగించుమార్గ మెద్దియన, నొకనికి, కుడిపంటియందు నొప్పిగలదు దానినిఁ గుదుర్చవలెనన్న వానికి నొప్పిగానున్న పంటికినెదురుగానుండు చెవి వద్ద ననగా నెడమచెవినద్ద నీమూతినిఁబెట్టి చెవులో నూఁదవలయును. అట్లు నీవూదునపుడు కుడిచెవిమూతి నీరెండు చేతులతో మూయవలయును. ఎల్లప్పుడును నీవు (Breathing) వూది బాగుచేయవలయునని తలఁచినప్పుడంతయు నూరక యూఁదక నీయొక్కమనస్సునునిలిపి, పంటినొప్పి పోవుఁగాకయని తదేకధ్యాన్నపరుడవై యూఁదవలయును. అట్లునీవై దాఱు నిమిషములు చేసినతక్షణమే వానికి పంటినొప్పి కొద్దియుఁ గానఁబడదు. అట్లు నొప్పిగానంబడనప్పటికిని మరల నొక పర్యాయము చేయుటమంచిది. ఇప్పుడు (Breathing) అనఁగా నూఁదుటను వాడుకచేయుటను నుపయోగించుటయుఁజెప్పితిని. ఇఁకఁ (Taping) దట్టుట నుపయోగించు విధమునఁ జెప్పెదను. నేమర్ అను నాతఁడనేకరోగములను జేతులతోఁదట్టి పోఁగొట్టినటుల బైబిల్ అను గ్రంథమునందుఁ జెప్పఁబడియున్నది. వీరు మనవారలు పెద్దరోగమని చెప్పు కుష్ఠురోగము సహితము

చేతులతోఁదట్టి బాగుచేసినటులఁ దెలియుచున్నది. దానిని మనము చేయవలయునన్న నసాధ్యము నాకుగానంబడలేదు. నేను బైఁజెప్పినరీతినే మనస్సును దన స్వాధీనమునందుంచుకొని తనదృష్టిని రోగియందునిలిపి "నీకు కుష్టుబాగవును" అని తదేకధ్యానముతో రోగముగల భాగమునఁ దట్టినయెడల తప్పక గుణముగానంబడును. నేనుబైనఁజెప్పియుండు హస్త సంచాలనమువలనఁగాని, లేక యూఁదుటవలనఁగాని మఱియుఁ దట్టుటవలనఁగాని, రోగము బాగుసేయవలయునన్నఁ ప్రతి మనుజుఁడును నేను మొదలఁజెప్పియుండు పద్ధతుల నవలంబించి చేసినయెడల వానికి నసాధ్యమనునది గానుపించక యెటువంటి మొండిజాడ్యమయినను, బ్రపంచమునందుండు మందులవలన నయముగాని జాడ్యమయినను బాగుచేయవచ్చును, జనులకుఁ గొందఱికి మెస్మరిజమనుదానివలన మూడుపూఁటలలో రోగము బాగుగావలెనుగదా అట్టు లేలయగుటలేదని నన్నుఁబలుమాఱనేకులడిగియున్నవారలు. ఈవిద్యవలనఁ గొన్ని రోగములయిదు నిమిషములలో నయమవుచున్నవి. అవి యెవ్వియనఁ, బాముగరచినను, దేలుగుట్టినను, లేక బెణుకునొప్పిగానున్నను, వీటినిఁ గొన్ని నిమిషములలోనే బాగుసేయవచ్చును. ఒకనికిఁ బదిసంవత్సరములుగాఁ గాళ్లయందు నొప్పులుండిన, వానిమీఁద నీవిద్యను ఉపయోగించినందున వానికి రెండుమూడురోజులలోఁ బోవుటగలదు లేక వానికే కొన్ని నెలలు పట్టుటయుఁగలదు. అట్లుగుణమిచ్చుట వానిశరీరమునుబట్టియు వానికినున్నరోగమును బట్టియు దినములు విస్తారముగాఁ బట్టునేగాని యవి వీరుపయోగించుదానియందేమియులేదు. నేను గొందఱురోగులకు



బాగుచేయునపుడు మొదలు పెట్టినదినము మొదలుకొని గుణము కానంబడుచు వచ్చినది మఱియు నేనితరరోగులమీఁదఁ జేయునపుడు వారము దినములవఱకుఁ గొంచెమయినను గుణము కానంబడక యెనిమిదవదినమున మిగుల గుణము నిచ్చినది. దీనివలన నేనూహించిన దేదియనఁ గొందఱి శరీరములయందు నుపయోగించినశక్తి వానిదేహమందుండు రోగమునకుఁ జాలకయుండవచ్చును. మఱియు నేనట్లు వారము దినము లుపయోగించినశక్తి విస్తారంబై యకస్మాత్తుగా గుణము గలుగుట గలదని యూహించితిని. అట్లు వారము దినములవఱకు గుణము కనఁబడకయుండి తదనంతరము బాగుగాఁబడిన రోగములు నాయనుభవములో ననేకములుగలవు వాటినన్నిటిని నేనిచ్చట వ్రాయుచుండిన నీపుస్తకమంతయు వాటితోనే నింపవచ్చును. కాని వాటిని ననవసరమని యూహించి యిచ్చట వ్రాయుట మానివేసితిని. ఈశక్తివలన మిక్కిలి సులభముగా బాగుచేయుటకు వీలుగానుండు రోగము లెవ్వియనఁ, గాళ్లనొప్పులును, దలనొప్పులును, బార్శ్వపు నొప్పులును, బెణుకులును, బిచ్చి, యన్నిరకముల జ్వరములును, నన్నిరకముల కుష్టులును, మూర్ఛలును, నుబ్బసములును, గొన్నిరకముల చెవుడులును, గ్రుడ్డి, పక్షవాయువు మొదలగు జాడ్యములును, నతిసులభముగా బాగుసేయవచ్చును. మఱియు దయ్యములుపట్టి బాధపడువారలకును శాతబడులవలన బాధపడువారలకును మిక్కిలి సులభముగా గుణముగలుగఁజేయవచ్చును, మఱియు నీవిద్యను నేర్చి రోగములమీఁద నుపయోగించవలెనన్న నీక్రింద నుదహరించువానిని జాగ్రతగా గమనించవలసియుండును. మలేరియల్

జ్వరముమీఁదగాని లేక పక్షవాయువుమీఁదఁ గాని, మఱియు నుబ్బసములమీఁదఁగాని, చేయునపుడు ముఖ్యముగా గమనించవలసినదేద్దియన, గాలి తూర్పునుండి పడమరకు వీచుసమయమున నీవు తూర్పువైపునఁగూర్చుండి రోగినిఁ బడమరవైపునఁ గూర్చుండఁ బెట్టవలయునేగాని రోగినిఁ దూర్పునఁ గూర్చుండఁ బెట్టఁగూడదు. నీవు రోగినిఁ దూర్పునఁ గూర్చుండఁబెట్టిన వారి రోగము మీఁకు గొన్నిసమయములయందుఁ జెఱుపుఁ జేయును. ఎల్లప్పుడును రోగములమీఁద హస్తసంచాలనముఁ జేయునపుడు ప్రతిహస్తసంచాలనమునకును నీయొక్క చేతులను విదలించుచుండవలెను. అట్లు రోగులయందు నీశక్తి నుపయోగించి నిలిపినతక్షణమే నీచేతులకు నీవే హస్తసంచాలనముఁ జేసుకొనవలయును. అట్లుచేసినందున వాని రోగము నీకు నంటనేరదు. మఱియు నేనిప్పుడు పైఁజెప్పిన వ్యాధులకు గుణము కలుగఁజేయుటకుఁగాను నారోగ్యవంతులుగా నుండువారి నయిదాఱుగురుమనుష్యులను దీసుకొనివచ్చి యొకరిబొటనవ్రేలిని మఱియొకరు పట్టుకొనునట్లుచెప్పి, రోగినిఁగూడా వానిలో నిలిపి వానియొక్క వ్రేలిని నీచేతితోఁ బట్టుకొని. రెండవవ్రేలిని మఱియొకరు పట్టుకొనవలయును. తదనంతరము నీ దృష్టిని మనస్సును రోగియందుఁ గొంచెము కాలమునిలిపి, పిమ్మట జట్టును నిలువఁబడియుండు వారలయందు నిలుపవలయును. అట్లు నీవు కొంచెము కాలము చేయఁగానే యచ్చట నిలువఁబడియుండు వారి శరీరములందుండు మంచి శక్తి రోగియొక్క శరీరమందుఁ బ్రవేశించును. పైప్రకారము పదియేను నిమిషములవఱకుఁగాని లేక ముప్పదినిమిషములవఱకుఁ గాని చేయ



వలయును. నీవు మనుష్యులను నేర్పాటు చేయునపుడు ముఖ్యముగా గమనించి యారోగ్యవంతులుగా నుండు వారి నేర్పాటు చేయవలయును. అట్లుగాక నీవు నిలువఁబెట్టు మనుష్యులలోఁ బిఱికివారున్నను బలహీనులున్నప్పటికిని వారు కొన్నిసమయములందు స్మారకము దప్పుట గలదు. కాన నీవు పైప్రకారము చేయునపుడు తగు జాగ్రతగలవాఁడవై యేర్పాటు చేయవలయును. ఎల్లప్పుడును నీవట్టులేర్పాటు చేయవలెనన్న నారోగ్యవంతులుగా నుండువారిని మఱియు ముప్పది సంవత్సరములకు లోగానుండువారిని నేర్పాటు చేయవలెను. నీవట్టులేర్పాటు చేయుమనుజులు రోగియొక్క కుటుంబముతోఁ జేరియుండిన రోగి చాలా లాభకారిగా నుండి మిక్కిలి త్వరితముగా బాగుగాగలఁడని నేనుమనస్ఫూర్తిగా నమ్మియు ననుభవము గలిగియు వ్రాసినాఁడను.

## మాగ్నెటిజం సంపాదించువిధము.

నేను ముందు ప్రకరణములయందుఁ జూపువలనను, గాలినుండియు. నీళ్లనుండియు, నాహార పదార్థములనుండియు (Magnetism) అను శక్తిని సంపాదించవచ్చునని చెప్పియుంటిని. మఱియుఁ బైఁజెప్పిన కారణములుగాక కొద్దిగాఁ గష్టమైనటువంటియు, విస్తారముగా శక్తిని సంపాదించు విధమును నీక్రిందఁ జెప్పెదను దానిని మీరసాధ్యమని యూహించవలదు. ప్రపంచమున నసాధ్యమను మాటకానంబడదు. కనుక ననేకులనేక సంగతుల నసాధ్యమని చెప్పుట మనము పలుమారువినియున్నారము గనుక నేనిచ్చట యసాధ్యమను దానిని

గుఱించి 'జనవినోదిని' యందుఁ జెప్పియుండుదాని నీక్రిందఁ జెప్పెదను. "అసాధ్యము కాజాలనిపని అనుమాటను మనమెన్నిమాఱులు వినియున్నాము! యోచించి చూడఁగా నామాట నుపయోగపఱుచుటకు నంత ప్రసక్తి యున్నదా! నిశ్చయముగా నసాధ్యమనునది యొకటి యున్నదా! అశక్యమనుమాట నుపయోగపఱుపఁబడు సమయములందంతయు నందొక కార్యమేనియు యథార్థముగా నశక్యమైనది యుండునేమో యనుటయు నాకు సందేహముగా నున్నది. సాధారణముగాఁ దమకుచేయు నిష్టములేని కార్యములనే యశక్యము సాధింపరానివి యందురు. సోమరితనముచేత సులభమైన పనిని సహితమశక్యమైనదియని చెప్పుచున్నారు. వారికిఁగూడ సహజముగా నట్లే తోఁచవచ్చును. యత్నించి నెఱవేర్చ పట్టుదల చాలకయు ధైర్యహీనత్వముచే యత్నించి చూడకయు నొక కార్యమును జనులు సాధారముగా నసాధ్య మందురు. తుదకు యోచింప పూన్కిచేతను విఘ్నాయాసమును సహించుటచేతను, బుద్ధిచేతను సాధింపరానిది యేదియుం గానము. యత్నించిచూచి మనచేనైనదంతయు చేసి పిమ్మటఁగదా మన మొకటిని నసాధ్యమని విడువవలయును. యత్నింపకయే, యేమియుజేయకయే మనమున్నట్లుండి యొక కార్యమును "సాధ్యమసాధ్య" మని చెప్పట సరి యగునా? ఒక తప్పు వాడుకనువదలుమని చెప్పినను, నొక గొప్పకార్యమును చేయుమన్నట్లది నాకశక్యము, అది యసాధ్యమయిన కార్యమని, జనులు చెప్పఁగా మనమెన్నిమాఱ్లు వినము? త్రాగుబోతునకు నొకనికి మద్యపానముఁ జేయుటవదలి పెట్టుము, అది సకల



దుర్విషయములకు హేతుభూతమయినది దేహమును చెఱచి వేయును, అని చెప్పిన యెడల మనము చెప్పునదంతయు సరియని తెలిసినప్పటికిని అది నాకు వాడుకయయినది దానిని విడుచుట నాకశక్యమని గదా సాధారణముగాఁ జెప్పును. అబద్ధము మాటలాడువాఁడు, దొంగలించువాఁడు, నందఱు నిట్లే చెప్పుదురు. తుదకుఁ జూచిన నవి యశక్యములా? సాధింపరానిది గదా యసాధ్యము! తఱుచుగా అవశ్యము లేకయే యీ యసాధ్యమను మాటనుజను లెన్నిమాఱ్లుపయోగ పఱచెదరు. అభివృద్ధికిని సత్ప్రవర్తనకును మిక్కిలి విరుద్ధమైనది. ఈ యసాధ్యమను మాటయే మనోనిశ్చయముతో మన కడ్డము వచ్చువాటినన్నిఁటిని నఱికి పొలియింపవలయును. అట్లదిర్చి జయించి తమ కార్యముల సాధించినవారే కార్యకోవిదులు వారే మహనీయులు. మహనీయులకు లక్షణము మనుష్యమశకంబులవలెఁగాక కాదని చెప్పనెఱుంగమి, మహనీయత వేరెందునను లేదు. ఇందుననే యున్నది. విఘ్నములఁ జూచి వెఱవమియుఁ దమపూనిన పనిని యసాధ్యమని వదలమియునే మహనీయతకు లక్షణము. "తనిసిరే వేల్పులు దధిరత్నముల చేత? వెఱచి రేఘోరకాకోల విషముచేత? విడిచిరే యత్నమృతంబు వొడము దనుక? నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు." అని భర్తృహరి చెప్పినట్లసాధ్యమని దేనినెంచక విఘ్నముల నన్నిఁటి నోర్చిపడరాని పాటులుపడి తమ పట్టిన మేలు కార్యములను సాధించినారనియే కదా గొప్పవారి చరిత్రలు పఠింపఁబడును. వారును ప్రశంసనీయులగుదురు. అటు గానిపక్షమున మనుష్యునకు బుద్ధియు, ధైర్యమును యత్నించిన

కార్యములు సాధించు శక్తియు సర్వజ్ఞుఁడిచ్చియుండుటకు నేమి ఫలము. వీనిని మనుష్యుఁడుపయోగ పఱుచుటయే కదా! ఇట్లుండనసాధ్యమనునది యెట్టిమాట? ఏదియుఁ జేయఁగ యసాధ్య మసాధ్యమనుచుండిన నెవ్వరికిని నభివృద్ధి యెట్లు కలుగును. అప్పుడు మనకును దిర్యగ్జంతువులకును భేదమేమి? యోచింపఁగానట్లుండెడి పశువులనవి మనకైనను మేలయినవే, మనోనిశ్చయముండిన త్రోవ తెనంతటనే యేర్పడును. అది లేనప్పుడున్నను లేకున్నట్లే యగపడును. యత్నము సర్వార్థసాధకము. అసాధ్యమన్నది కల్ల. రిత్తమాట 'సాధ్యము' అనునది యెంత సంతోషకరమైన పదము! అది కష్టము సాధింపఁగూడినదయినను, సాధింపవచ్చునన్న తలంపెంత సంతోషము నిచ్చును. ఒక రోగ పీడితునకుఁ దనరోగము సాధ్యమన్న నెంత నంతోషము. ఎంత ద్రవ్యము వ్యయమయినను ఎంత పథ్య నియమములతో నుండవలసియున్నను దుదకుఁ దీఱుట యెంత కష్టమయినప్పటికిని దన వ్యాధి తీఱుట సాధ్యమన్న మాత్రముననే యెంత సంతోషము గలుగును. అసాధ్యమన్ననో యెంత దుఃఖకరమయిన మాట. ఆ మాట విన్నప్పుడే యెంత వైరాగ్యమును వెగటును బుట్టించును. సాధ్యము సుఖకరమును నసాధ్యము దుఃఖకరము నవును గదా! సాధ్యమను మాట సకల శుభప్రదాయియై సిరితోఁ బోల్పదగియున్నది. అసాధ్యమనుమాట యేజనులకుఁ దెలియకుండిన నెంత చక్కఁగా నుండును. ఆమాట మనుష్యభాషలో నేల కలిగెను. లార్డు బ్రౌహ్యాము అను నాంగ్లేయ గ్రంథకర్త యొకచోట (అసాధ్యమనునది యొకటి యున్న



దా? అది హీనులచేతఁ బ్రయోగింపఁదగిన పదము) అని చెప్పియున్నాఁడు. అది సరే కదా! అసాధ్యమనునప్పుడు మన శక్తిహీనతను గదా చూపుచున్నది! మనకున్న శక్తికొలఁది దేనిని నసాధ్యమనకయే యన్ని మంచి కార్యములను బ్రయత్నించి సాధించిగదా మనము చూడవలయును. మన సోమరితనమునకొక నెపమునుబెట్టి కష్టపడుటకు నిచ్చగించక యుండి యసాధ్యమని చెప్పక మిక్కిలి పట్టుదల గలిగి సాధ్యమనియెంచి నేను జెప్పుదానినిఁ జేయవలయును" ఉదయమున నీవు పడకనుండి లేచినతోడనే కూర్చుండి నీయొక్క మనస్సును నిలిపి నీదృష్టిని నీ మూలాధారముమీఁద నుపయోగించవలెను. అట్లుపయోగించునపుడు నీమనస్సున నీ మూలాధారమువద్ద మంచి శక్తి ప్రవేశించి విస్తారమవుచున్నదని తలచుచుండవలెను. అట్లు కొన్ని దినములు గడచినంతనె అచ్చోట (Magnetism) అను మంచి శక్తి విస్తారంబై యచ్చట నిలువనేరక నీవెన్నముకయందుఁ బ్రవేశించి వెలుపల వచ్చుచుండును. అట్లు వెలుపలకు వచ్చునపుడు తలలోఁ బోటు పుట్టిన దానినిఁ జేయుట మానవలయును. అట్లు కొన్ని దినములు చేయుట నాపివేసి తిరుగ ప్రారంభించవలయును. అట్లు మొదలు పెట్టినపుడు వెన్నముకనుండివచ్చి తలలోఁ బ్రవేశించు (Magnetism) శక్తినిఁ దలమీఁదుగా వచ్చునట్లు వాడుక సేయవలయును. నీవు దానివి సాధించినట్లయిన గొప్పమహాత్తుగల యోగులలో నొకఁడవని చెప్పుటకు నెటువంటి సందేహమునుండదు. నీవంత శక్తిగలవాఁడవైనపుడు నీ దృష్టిని మూలాధారమునందు నిలిపి యెవనినయినను చూపించినను

లేక దీవించినను నది తప్పక నెఱవేరును. ఈ యభ్యాసము వలననే గదా ఋషిపుంగవులు శపించుచు వచ్చిరి. నేనిప్పుడు పైఁజెప్పిన పద్ధతిని వాడుకకుఁ దేవలెనన్న నీ యభ్యాసము నందు నిపుణులుగా నుండువారిని దగ్గఱనుంచుకొని సేయవలయును. లేనియెడల నపాయములు సంభవించును. గనుక దీనిని వాడుకసేయునపుడు తగు జాగ్రతగలిగి త్వరపడక చేసిన యెడల మిక్కిలి ప్రవీణత గల వారగుదురు.

## గాలియందు లేచుట.

గాలియందు మనుష్యుని లేవఁదీయవలెనన్న నట్లు చేయువానికి మనశ్శక్తివిస్తారముగా నుండవలయును. మఱియు నట్లు చేయువాఁడీయాకర్షణ విద్యయందుఁ జాలా వాడుకపడినవాఁడుగా నుండవలెను. పై ప్రకారముగల మనుజుఁ డెవనినైనను గాలియందు నిలుపవలెనన్నఁ జాలా సులభము. నేనీవింతను అనేకవేల పర్యాయములు చేసియుంటిని. నా యొక్కయనుభవములో దీనినిఁ జేయుటనాకుఁ గడుసులభముగా గానంబడుచున్నది. కావున దీనిని వాడుకచేసి గాలియందు నిలుపఁదలఁచుకొనిన ప్రతివారును నీక్రింది విధముగాఁ జేయవలయును. నీవుచేయఁబోవు వానిని నిదురయందుంచి వానితో శరీరమంతయు గాలితో నింపఁబడినది. నీ శరీరమందుండు ప్రత్యవయవమును గాలితో నింపఁబడినది. ఈశరీరమందుండు నవయవములన్నియు గాలికంటెఁ దేలిక యవుచున్నదని చెప్పవలయును. పిమ్మట నీయొక్క శరీరము గాలిలో మెల్లగాఁ లేచునని చెప్పవలెను. అంతట నాశరీరము మెల్లఁగా



లేచుటకునారంభించును. దీనినే బాగుగా వృద్ధిచేసిన విశ్వామిత్రుఁడు త్రిశంకుని గాలియందు నిలిపినటుల నిలుపవచ్చును. తదనంతరము తిరుగ గాలినుండి క్రిందికి దించుటకుఁగాను "నీ శరీరము బరువెక్కుచున్నది, నీవు భూమిమట్టమునకు మెల్లఁగా వచ్చెదవు" అని చెప్పవలయును. అంతట శరీరము క్రిందికివచ్చును. పిమ్మట, నీ శరీరమందుండు ప్రత్యవయవమును పూర్వపుస్థితికి వచ్చినదని చెప్పి నీవు నిదురనుండి మేల్కొనెదవని చెప్పవలయును. అంతట వాఁడు నిదుర మేల్కొనును దీనినిఁ బ్రతిదినమును గొంచెము కొంచెముగా వాడుకకుఁ దేవలయునుఁ ఒకచేతూఱి త్వరపడినందున లాభములేదు. గనుకఁ బట్టుదలగలిగి దినములపేరిట దీనిని వాడుకకు దేవలయును, తనకుఁ దాను గాలియందు లేవవలెనన్నఁ, బైప్రకారము మనస్సునఁ దలఁచి దేహమందుండు నవయవములనన్నిటిని బలహీనమవునటులఁ జేసి గాలినిఁ బూరించవలయును. ఇది ముఖ్యముగాఁ జేయవలెనన్నఁ బ్రాణాయామము వాడుకఁ జేయవలసియున్నది. ప్రాణయామమనఁగాఁ గుడి ముక్కు రంధ్రమును మూసి రెండవ ముక్కుతో పదియాఱు సెకండుల వఱకుఁ గాలిని మెల్లఁగా లోనికిఁ బీల్చి మెల్లఁగా విడువవలయును. పిమ్మట రెండు ముక్కు రంధ్రములను మూసి యొక నిమిషము నాలుగు సెకండ్లుండవలెను. పిమ్మట ముప్పదిరెండు సెకండ్లవఱకు గాలినిమెల్లఁగా బీల్చి మెల్లఁగా విడువ వలయును. పైఁజెప్పినదంతయుఁ గలసి యొక ప్రాణాయామమగును. దినిని వాడుకసేయు ప్రతి మనుజుఁడును దినమునకు నూటయెనిమిది పర్యాయములు సేయవలయును.

ఈ ప్రాణాయామమును వాడుక సేయుటకు నుదయమున భోజనము సేయక, వాడుక సేయుట చాలా లాభకరము. అది యే తగినకాలము నేనిపుడు పైఁజెప్పినది గాలియందు లేచుటకును జాలాకాలము జీవించుటకును జాలాయుపయోగముగాఁ బ్రతివారును వాడుక సేయుట మంచిది.

## స మా ధి.

సమాధి సేయుటయనఁగాఁ బ్రాణముతోనున్న వారిని, బూడ్చుటయని అర్థము. దీనినిఁ జేయవలెనన్న పై చాప్టరు నందుఁ జెప్పినదానినిఁ జేయఁగలవారే దీనినిఁ జేయగలవారు గాని యితరులు చేసిన నపాయము సంభవించును. ఇతరులను సమాధి చేయవలెనన్న వానిని నిదురయందుంచి వాని శరీరమందుండు నవయవములన్నిఁటియందును సత్తువలేక యెండి పోవునట్లును శ్వాసము లేనట్లును జేయవలయును. పిమ్మట నాలుక లోనికినెట్టి మైనమును నవరంధ్రములకుఁ బెట్టవలయును. ఏలనన నెఱ్ఱలు మొదలగు భూమియందుండు జంతువులు శరీరములోనికిఁ బోయి చెఱచకుండుటకై జాగ్రతగా నవరంధ్రములను మూయవలయును. పై ప్రకారము జాగ్రతపడిన తదుపరి విశాలముగానుండు గోతియందీ శరీరమునుంచి మట్టి నివేసి గోతిని మూయుము. నీ వాశరీరమును నెన్ని దినముల వఱకు భూమియందుంచఁ దలఁచితివో యంతకాలముంచి తదుపరిదినమే శరీరమును భూమినుండి తీయవలెను. అట్లు భూమినుండి వెలుపలఁదీసినను మనుష్యుని నిదుర మేల్కొనఁ



జేయవలయును. ఈ విధముగాఁదన శరీరమందుండు పటుత్వము తగ్గునట్లును శ్వాసనిలుచునట్లు తానే చేసుకొని సమాధి పొందవచ్చును. సమాధిచేసుకొనుటకుఁగాను జాలా వాడుక సేయవలసియున్నది. కావున నీవు విశేషముగా నీ శరీరమును స్వాధీనమునకుఁ దేనిది సమాధినిపొందుటకుఁ ప్రయత్నించఁ గూడదు. కావునఁ గష్టపడి వాడుకకుఁదెచ్చిన నీ యిష్టానుసారముగా నీ శరీరమునుంచుకొనఁగలవు. కావునఁ బై ప్రకారము యత్నింప సాహసించినవారెన్నఁడును నిష్ఫలముఁ బొందరు. 'కష్టీ ఫలీ' యను వాక్యరీతిని మనుజుఁడు కష్టపడి యేకార్యమునైనను బ్రయత్నించి చేసిన సిద్ధిఁబొందక పోఁడని నామతము. ఈ గ్రంథాంతర విషయంబులెల్లను నాస్వానుభవములోనివేగాని గ్రంథస్థంబులగు టక్కుమాటలుగావు. ఇది సత్యము, సత్యము, సత్యము.

సంపూర్ణము.



---

## సుబోధినీ గ్రంథమాల, నెల్లూరు.

---

ఇందు సుబోధకంబులగు సుప్రసిద్ధ మహాపురుషులజీవిత చరిత్రములు, వారిబోధనలు, నవలలు, ఉపన్యాసములు మొదలగునవి ప్రచురింపఁబడును.

రెండేసి నెలలకు సుమారు పుట 100 లకు పైగాగలగ్రంథము చొప్పునఅరునెలలకు మూడు గ్రంథములు వెలువడును.

ఆరునెలలకు ఒకపర్యాయము ప్రథమగ్రంథము వెంటచందాదారులు రు 1-0-0యు, సహాయులు రు 2-0-0 లు, పోషకులు, రు 5-0-0 లు, ప్రధానపోషకులు, రు 10-0-0 లు, చెల్లించవలయును. రు 10-0-0 లకుపైగా చెల్లించువారు రాజపోషకులు.

చందాదారులకు కాకితపుబైండు పుస్తకముల నిచ్చెదరు. తక్కిన తరగతులవారికి అట్టబైండుగల గ్రంథములనిచ్చి వారిపేర్లను ప్రతిగ్రంథమునఁ బ్రచురింతురు. తపాలాఖర్చులు వీరేభరించెదరు. యిదివరకు ప్రకటితమైన గ్రంథములు.

| | | చందాదారులకు | యితరులకు |
|---|---|---|---|
| 1 | పంచమజార్జిచక్రవర్తి | 0-6-0 | 0-8-0 |
| 2 | రామతీర్థస్వామి | 0-6-0 | 0-8-0 |
| 3 | శంకరాచార్యులు | 0-6-0 | 0-8-0 |
| 4 | నివేదిత | 0-6-0 | 0-8-0 |
| 5 | మంజునుతి (చరిత్రనవల) | 0-8-0 | 0-10-0 |
| 6 | హార్డింజిప్రభువు | 0-6-0 | 0- -0 |

విలాసము.

యం. ఆర్. కృష్ణారావు కంపెని

బుక్ సెల్లర్సు

నెల్లూరు.

## ఆంధ్రవిజ్ఞాన భానోదయ గ్రంథమాల.

ఈ పేర సంవత్సరమునకు 12 యుత్తమగ్రంథములు విఖ్యాతిగాంచిన గ్రంథకర్తలచే నందఱకు బోధపడునటుల సులభశైలిని క్లుప్తముగ వ్రాయించి ప్రచురింపఁజేయుచున్నారము, గ్రంథములు చిత్రపటములతోను ముద్దులొలుకు బైండింగు, మంచిగ్లేజు కాగితములపైని ప్రస్ఫుటాక్షర ముద్రణముతోను క్రమముతప్పక వెలువడుచుండును. ఈ గ్రంథములు పిల్లలకును, పెద్దలకును, స్త్రీలకును, బాలికలకును, చదువుట కెంతయో మనోహరములేగాక జ్ఞానదాయకములుగా నుండును.

ప్రతిగ్రంథము ఆయావిషయముల నారితేరిన గ్రాడ్యుయేట్లచే వ్రాయఁబడుచున్నది. మాయుద్దేశములు తక్కిన గ్రంథమాలలవారి యుద్దేశముల వంటివి కావు. అనేక విషయముల చిన్నచిన్న గ్రంథముల మూలమున ఆంధ్రదేశమున విజ్ఞానవ్యాప్తిగావించు నిమిత్తము మేము దీనిని స్థాపించి ఆంధ్రమహాశయుల పోషకత్వమును నిరీక్షించుచున్నారము. అదియుగాక పెద్దపెద్దగ్రంథములు ప్రచురించి చదువరులకు చివరకేదియు బోధపడనట్లు చేయుట మావిధికాదు పైగ్రంథమాలలెగాక మాగ్రంథముల నతిసులభ వెలలకే యొసంగుచున్నారము. చందాదారులవద్దపైకము దోచుకొని జీవించుమనుట మాయాశ ఎన్నటికినిగాదు. మాగ్రంథములకంటె చౌక గ్రంథములు ఆంధ్రలోకమున లేవని మేము ధైర్యముతో చెప్పగలము. ఇంత ప్రశస్తగ్రంథములు ఇంత ప్రశస్తపరీక్షయందు తేరినవారిచే వ్రాయింపఁబడిన గ్రంథములు ఇంత సులభమైన శైలిని క్లుప్తముగ మరెచ్చటను లేవు. మాగ్రంథముల నిదివరకే ఆంధ్రపత్రికా రత్నములు పొగడియున్నవి. మాగ్రంథమాల నిర్వాహకమండలియే మా మాలయొక్క ఘనతకు నిదర్శనము. 12 గ్రంథములను పోస్టేజి మొదలగున వేవియును లేక నేరు 1-4-0 నొసంగుచున్నారము బి. ఏలు ఎం. ఏలు, ఎం బి. సి. ఎం ఏలు మొదలగు గొప్ప పరీక్షలు ప్యాసయినవారి వ్రాతలు 12-ం రు. 1-4-0 చేయజాలవా ? నెలకు జ్ఞానార్జనముకొరకై రు. 0-1-6. అరుకానులు వినియోగింపరాదా ? మా యుద్యమము నాదరించి పోషింపుడు. ఈదినమే చందాదారులుగా చేరుదురుగాక!

ఆంధ్ర విజ్ఞాన బానోదయ, సోంపేట, గంజాం.

## Novel Publishing House,

**POST BOX No. 230.**

**MADRAS.**

దేశాభివృద్ధికి ఆవశ్యకములైనవియు, చరిత్రవిషయకమయినవియు, రహస్యాపరాధ పరిశోధనా విషయములయు, (Detective) సాంఘికవిషయ (Social) మయినవియు నవలలను సంవత్సరముకు నాలుగు చొప్పున చందాదారుల కందింపచేయబడును.

ఇందు సంవత్సరముకు 1200 పుటలు రమారమి గల స్వతంత్రమైన గ్రంథములు నాలుగు ప్రచురింపబడును.

గ్రంథములు శాశ్వత చందాదారులపద్ధతిని విక్రయింపబడును. చందాదారులకు నూరుపుటలకు పోస్టేజీగాక 0-4-0 చొప్పునను, యితరులకు 0-6-0 చొప్పునయు యిచ్చుచుందుము.

చందాదారులు మొదలు నేమియు యీయ నక్కఱలేదు. ప్రవేశరుసుము మాత్రము 0-4-0 చెల్లింపవలెను. సంవత్సరముకు 1200 పుటలకంటె నెక్కువ ప్రకటింపము గనుక మూడు రూపాయలకన్న నెక్కుడు కానేరదు.

గ్రంథమాలలోని గ్రంథములన్నియు మనుపైన దళసరి కాగితములమీద ముద్రింపబడును. అనేక చక్కని పటములతో నొప్పుచుండును. క్యాలికో బైండు చేయబడును. సరసమైన వచనశైలిని కలిగియుండును. ఇట్లు సర్వాంగ సుందరములై చౌకవెలలకు దొరకు గ్రంథములు తెలుగుభాషయందరుదు.

విలాసము. నవలాగ్రంథమాలానిలయము

తపాలుపెట్టె నెం. 230, మద్రాసు.

# సంస్కృతాంధ్ర గ్రంథములు.

చౌకయిన ధరలకు విక్రయింప బడును.

హరివంశం,—యెఱ్ఱాప్రగ్గడకవిప్రణీతం, ఇందు యింద్రుడు వజ్రాయుధముచేత దితిగర్భంబు చేధించుటయును, సనత్కుమారుడు మార్కండేయునకుజెప్పిన పితృదేవతా ప్రభావంబును, వామనుడు బలికి సంబాంధవంబుగా బాతాలంబునకు బోవం బనుచుటయును మొదలగు ననేక విషయములుగల పద్య కావ్యము. ధర మొదటిరకం. కాలికోబైండు. ౨-౮-౦

శ్రీస్కాందపురాణాంతర్గతమగు, శివరహస్యఖండం—ఇయ్యది౸ ముదిగొండ బ్రహ్మయ్యలింగారాధ్యునిచే రచియింపబడినది. ౪౧౬ పేజీలు ధర మొదటిరకం. కాలికోబైండు ౨-౮-౦

పంచదశప్రకరణార్థసంగ్రహము—శ్రీవిద్యారణ్య స్వాములవారి విరచితంబగు వచనకావ్యం. సులభశైలినివ్రాయబడినది. ఇందు చిత్ర, తృప్తి. కూటస్థ, ధ్యాన, న్నాటకదీపికలును, తత్వ. పంచభూత, పంచకోశ ద్వైత, మహావాక్య అను వివేకపంచకమును, యోగ, ఆత్మానంద, అద్వైతానంద, విద్యానంద, విషయానందమును, ఆనందపంచకమును గలిగియున్నవి. గొప్ప వేదాంతగ్రంథం, మంచి గ్లేజుకాగితములయందు చక్కని ముద్దు అక్షరములతో ముద్రింపబడినది. ౩౦౫ పేజీలుగల ప్యాకెట్టుసైజు, కాలికోబయిండు ధర పోష్టేజుసహా. రూ॥ ౧-౪-౦

విలాసము.

వెద్దనపూడి సంజీవయ్య అండ్ సన్

35 సమ్మాళ్వారువీధి. మద్రాసు.

శ్రీ ర స్తు.

# ఆంధ్ర లక్ష్మీపుస్తకాలయము

## ఆంధ్రపద్యకావ్యములు.

| | ప్రతి 1 కి రు | అ. |
|---|---|---|
| శ్రీమదాంధ్రమహాభారతము 7 వాల్యములుగా బైండుకట్టబడియున్నది | | |
| ,, ఆదిసభాపర్వము | 1 | 12 |
| ,, ఆరణ్యపర్వము | 1 | 12 |
| ,, విరాటోద్యోగపర్వములు | 1 | 12 |
| ,, భీష్మద్రోణపర్వములు | 1 | 12 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 1 | 12 |
| ,, శాంతిపర్వము | 1 | 12 |
| ,, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | 1 | 12 |
| శ్రీమదాంధ్రమహాభాగవతము | 3 | 0 |
| డిటో మేలుప్రతి | 4 | 0 |
| డిటో మేలుప్రతి 2 వాల్యములు | 4 | 12 |
| డిటో అత్యుత్తమప్రతి ,, | 5 | 12 |
| డిటో 80 పౌనుల కాగితములు 2 వాల్యములు | 6 | 8 |
| భాస్కరరామాయణము | 2 | 8 |
| ఉత్తరరామాయణము | 1 | 8 |
| డిటో మేలుప్రతి | 2 | 8 |

| | ప్రతి 1 కి రు | అ. |
|---|---|---|
| రంగనాథరామాయణము | 0 | 8 |
| డిటో మేలుప్రతి | 2 | 8 |
| మొల్లరామాయణము | 0 | 8 |
| అచ్చతెనుగురామాయణము | 1 | 4 |
| డిటో కాలికోబైండు | 1 | 8 |
| కృష్ణరాయవిజయము | 0 | 8 |
| విరాటపర్వము సటీక | 3 | 8 |
| ఆదిపర్వము సటీక | 4 | 0 |
| అనుశాసనీకపర్వము,, | 5 | 0 |
| మనుచరిత్రము ,, | 0 | 10 |
| డిటో మేలుప్రతి ,, | 1 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి,, | 2 | 8 |
| వసుచరిత్రము. సవ్యాఖ్యానము | 2 | 8 |
| ఆముక్తమాల్యద సటీక | 2 | 8 |
| విష్ణుపురాణము | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము | 0 | 8 |
| కళాపూర్ణోదయము | 1 | 8 |
| రాఘవపాండవీయం సటీక | 1 | 8 |
| శృంగారనైషధము | 0 | 10 |
| డిటో సటీకచక్కనిప్రతి | 3 | 8 |
| శ్రీభీమఖండము | 0 | 12 |
| నరసభూపాలీయము | 0 | 8 |
| డిటో కాలికోబైండు | 0 | 12 |
| విజయవిలాసము | 0 | 4 |

| ప్రతి 1 కి | రు. | అ. |
|---|---|---|
| డిటో కాలికో బైండు | 0 | 8 |
| డిటో సటీక | 1 | 0 |
| సారంగధర | 0 | 8 |
| వైజయంతీవిలాసము | 0 | 8 |
| రంగరాయచరిత్ర | 0 | 8 |
| డిటో కాలికో బైండు | 0 | 12 |
| రామాభ్యుదయము | 1 | 4 |
| డిటో కాలికో బైండు | 1 | 8 |
| నీలాసుందరీపరిణయం | 0 | 4 |
| రసికజనమనోభిరామము | 0 | 8 |
| డిటో కాలికో బైండు | 0 | 12 |
| రుక్మిణీపరిణయము | 0 | 6 |
| డిటో కాలికో బైండు | 0 | 10 |
| కూర్మపురాణము | 2 | 8 |
| మార్కండేయపురాణము | 2 | 8 |
| హాలాస్యమహాత్మ్యము | 2 | 0 |
| రాజశేఖరవిలాసము | 0 | 8 |
| డిటో కాలికో బైండు | 0 | 12 |
| పారిజాతాపహరణము | 0 | 4 |
| డిటో మేలుప్రతి | 0 | 6 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 8 |
| డిటో కాలికో బైండు | 0 | 12 |
| అనిరుద్ధచరిత్రము | 0 | 8 |
| డిటో కాలికో బైండు | 0 | 12 |
| విక్రమార్కచరిత్రము | 1 | 0 |
| డిటో కాలికో బైండు | 1 | 4 |
| పాండురంగమహాత్మ్యము సటీక | 1 | 8 |
| వెంకటాచలమహాత్మ్యము | 0 | 14 |

| ప్రతి 1 కి | రు. | అ. |
|---|---|---|
| సమీరకుమారవిజయం | 0 | 8 |
| కాశీఖండము | 0 | 6 |
| దశావతారచరిత్రము | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవి | 0 | 12 |
| సీతారామాంజనేయసంవాదము తాత్పర్యము | 1 | 0 |
| డిటో సటీక మేలుప్రతి | 1 | 4 |
| జైమినీభారతము | 0 | 8 |
| డిటో కాలికో బైండు | 1 | 0 |
| ఉత్తరహరివంశము నాచనసోమనప్రణీతము | 1 | 4 |
| హరివంశము, ఎఱ్ఱాప్రగడ | 1 | 8 |
| రుక్మాంగదచరిత్రము | 0 | 6 |
| సులక్షణసారము సటీక | 0 | 8 |
| సప్తమస్కంధము సటీక | 1 | 0 |
| అప్పకవీయము | 0 | 12 |
| డిటో శుద్ధప్రతి | 1 | 6 |
| డిటో ,, కాలికో | 1 | 10 |
| వేమనపద్యములు 200 గలది | 0 | 2 |
| డిటో 1200 గలది | 0 | 4 |
| డిటో 500 గలది తాత్పర్యం | 0 | 14 |
| డిటో 2000 గలది | 1 | 0 |
| డిటో 3000 గలది | 2 | 0 |
| డిటో బ్రౌనుదొరగారి యింగ్లీషుతో యున్నది | 1 | 0 |
| గజేంద్రమోక్షము సటీక | 0 | 6 |
| డిటో కాలికో బైండు | 0 | 8 |
| రుక్మిణీకల్యాణము సటీక | 0 | 6 |



| ప్రతి 1 కి | రు. | అ. |
|---|---|---|
| డిటో కాలికో బైండు | 0 | 8 |
| నలోపాఖ్యానము సటీక | 0 | 6 |
| శ్రీరామచరిత్ర | 0 | 8 |
| చాటుపద్యమణిమంజరి | 1 | 0 |
| చంద్రరేఖావిలాపము హాస్యరసప్రధానము | 1 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానం ద్విపద గౌరనమంత్రి | 1 | 0 |
| శ్రీనాథునివీథినాటకము | 0 | 2 |
| గణితాగుణప్రవర్తనతారావళి | 0 | 2 |
| బిల్హణీయం | 0 | 6 |
| డిటో కాలికో బైండు | 0 | 10 |
| తారాశశాంకవిజయము | 0 | 6 |
| డిటో మేలు కాలికో | 1 | 0 |
| సిద్ధేశ్వరీయము | 0 | 10 |
| శశిరేఖాపరిణయము | 0 | 3 |
| సానందోపాఖ్యానము | 0 | 3 |
| కుబ్జాకృష్ణవిలాసము | 0 | 8 |
| ఆంధ్రకలికిపురాణము | 1 | 4 |
| దమయంతీపరిణయము | 0 | 4 |
| వెంకటగిరిమహాత్మ్యము | 0 | 4 |
| హంసవింశతి | 1 | 0 |
| రాధికాసాంత్వనము | 0 | 8 |
| డిటో కాలికో బైండు | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము | 0 | 12 |
| డిటో కాలికో బైండు | 1 | 2 |
| కుచేలోపాఖ్యానము సటీక | 0 | 4 |
| డిటో గట్టుప్రభువు | 0 | 6 |

| ప్రతి 1 కి | రు. | అ. |
|---|---|---|
| పరసయుమాకవిత్వము | 0 | 3 |
| అపూర్వకవితావిమర్శనము | 0 | 4 |
| కవితావిమర్శనము | 0 | 4 |
| శ్రీకృష్ణలీలావిలాసము శృంగారప్రబంధము | 0 | 12 |
| రంభా నలకూబరవిలాసము, శృంగారప్రబంధము | 0 | 8 |
| రాధామాధవసంవాదము | 0 | 4 |
| సత్యభామాసాంత్వనము | 1 | 0 |

## శతకములు.

| | | | |
|---|---|---|---|
| సుమతీశతకము | సటీక | 0 | 2 |
| కుమారీశతకము | ,, | 0 | 2 |
| దాశరథీశతకము | ,, | 0 | 4 |
| మానసబోధశతకము | ,, | 0 | 2 |
| భాస్కరశతకము | ,, | 0 | 3 |
| కలువాయిశతకము | ,, | 0 | 2 |
| కవిచౌడప్పశతకము | ,, | 0 | 2 |
| నృసింహశతకము | | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | | 0 | 1 |
| కాళహస్తీశ్వరశతము | | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము | | 0 | 2 |
| దేవకీనందనశతకము | | 0 | 2 |
| కృష్ణశతకము | | 0 | 2 |
| సంజీవరాయిశతకము | | 0 | 2 |
| నారాయణశతకము | | 0 | 2 |
| కాళహస్తిశతకము, (సాంబశివా) | | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | | 0 | 2 |

| ప్రతి 1 కి | రు. | అ. |
|---|---|---|
| జానకీవరశతకము | 0 | 1 |
| రామశతకము | 0 | 1 |
| వేణుగోపాలశతకము | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | 0 | 1 |
| లావణ్యాశతకము | 0 | 1 |
| మల్లికార్జునశతకము | 0 | 1 |
| రామతారకశతకము | 0 | 1 |
| తాడిమల్ల రాజగోపాలశతకము | 0 | 1 |
| మల్లెలరామలింగశతకము | 0 | 1 |
| సిఖినరసింహాశతకము | 0 | 1 |
| కాం తాలలామశతకము | 0 | 1 |
| కుమారశతకము | 0 | 1 |
| మాతృశతకము | 0 | 2 |

| ప్రతి 1 కి | రు |
|---|---|
| కలివిడంబశతకము | 0 |
| సూర్యశతకము | 0 |
| **డ్రామాలు.** | |
| మోహినీవిలాసము | 0 |
| హరిశ్చంద్ర చిన్నది | 0 |
| సత్యహరిశ్చంద్ర | |
| సంగీతసారంగధర | 0 |
| చంద్రకాంత | |
| చిత్రనళీయనాటకం | 0 |
| జగన్మోహిని విలాసము | 0 |
| సంగీతసావిత్రి | 0 |
| సైంధవపరాభవము | 0 |

యిదిమొదలగు సంస్కృతాంధ్రగ్రంధములు వలం

వారు.

ఆంధ్రలక్ష్మీ పుస్తకాలయము.

నెం. 75 గోవిందప్పనాయునివీధి, మద్రాసు.

(అని వ్రాయుడి

